# పెళ్ళిట్రెయినింగు

( రెండు ఆటలు )

భమిడిపాటి కామేశ్వరరావు

పెళ్ళిట్రెయినింగు; పూర్వరంగము





పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# పెళ్ళిప్రయివింగు

( రెండంకములు )

భమిడిపాటి కామేశ్వరరావు

పెళ్ళిప్రయివింగు ; పూర్వరంగము




ప్రతులకు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# హెచ్చరిక

---

కేవల వినోదం నిమిత్తమైనాసరే, లేక సొమ్ము వసూలు చేసుకునే నిమిత్తమైనాసరే, ఈ ప్రహసనాలలో ఏదైనా సభ ఎదట ఆడదలచిన ప్రతి సంఘం వారున్నూ, ముందుగానే, గ్రంథకర్తకి వ్రాసి లిఖితానుమతి పొందక పోవడం కాపీరైట్ చట్టప్రకారం ఒక నేరం గనక, ఆసంగతి గమనించి లిఖితానుమతి పొందిన తరవాతనే ఆడుకోవాలి.

భమిడిపాటి కామేశ్వరరావు

రాజమండ్రి

# పెళ్ళి ట్రెయినింగు

[మోలియర్ రచనల్లో ఒకదానికి ఇది అనుసరణం. ఇది 13–2–1944 తేదీని రాజమండ్రి ఆర్ట్సుకాలేజి మెట్కాఫ్ వసతిగృహంలో శ్రీ కాశీపట్నుల కోదండయ్యగారి అధ్యక్షత కింద జరిగిన వసతిగృహ వార్షికోత్సవ సమావేశ సందర్భంలో, అనుమతితో, ప్రదర్శించారు.]

కానయ్య (అనే అయనాచలం) – శ్రీ దుగ్గిరాల సత్యనారాయణరావు
చంద్రప్రభ – శ్రీ ఆకునూరి కృష్ణమూర్తి.
సీతాకం – శ్రీ పాలగుమ్మి వీరభద్రేశ్వరరావు.
మాలోకం – శ్రీ చామర్తి సూర్యనారాయణ.
పేరయ్య – శ్రీ రావాడ గున్నేశ్వరరావు.
సంతోషం – శ్రీ వాడ్రేవు సుబ్రహ్మణ్యం.
కాటయ్య – శ్రీ రాణంగి శివకామేశ్వరరావు.



ఈ గ్రంథంలో వాడిన సంజ్ఞలు:–

| | |
|---|---|
| R F = కుడి ఎదర | L F = ఎడమ ఎదర |
| R M = కుడి మధ్య | L M = ఎడమ మధ్య |
| R B = కుడి వెనక | L B = ఎడమ వెనక |

# 1వ రంగం

[శానయ్యబస. చిన్న బల్లా, రెండుమూడు కుర్చీలూ ఉన్న గది. తెరఎత్తిన తరవాత కుడిఎదరనించి శానయ్య వచ్చి ఎవరికోసమో కనిపెట్టుకున్నట్టు కనిపించి పచారుచేస్తూ ఉంటాడు. ఎడమ ఎదరకేసి చూస్తాడు. అక్కణ్ణించి నరయ్య వస్తాడు.]

శా:—(ఎడమ ఎదరనించి నరయ్య రాబోతూంటే) నరయ్యా? రా! (అని కుర్చీ చూపిస్తాడు)

న:—(వచ్చి కూర్చుంటాడు)

శా:—ఇంత ఆలస్యం అయిందేం? మా మాలోకాన్ని పంపించి చాలాసేపైందే!

న:—ఏమో! ఇంతకి ముందే వచ్చి చెప్పాడు మరి?

మా:—(ఎడమఎదర్నించే వచ్చి) చాలాసేపైందండీ, చెప్పించే నాప్రస్తంఖాల...

శా:—సరేరా నువ్వు ఉండు.

మా:—ఉంటానండి. (అని అక్కడే నుంచుంటాడు)

శా:—ఉండటం అంటే వీధుల్లో.

మా:—అక్కడ నేను కూచోనాండి?

శా:—పడిశాక్ పోదూ. వెళ్ళి ఎవరూ రాకుండా చూ

స్తూంను.

వా:— చిత్తం. (అని ఎడమమధ్యకి పోతాడు)

న:— నువ్వు ఊర్నించి ఎప్పుడొచ్చావ్ ?

శా:— నిన్ననే.

న:—ఏమిటి విశేషం ?

శా:— ఏముందీ, పెళ్లి రేపే!

న:— ఎవరి పెళ్లిమాట నువ్వనేది ?

శా:—(పళ్ళు కనపరుస్తూ) నాపెళ్లే!

న:— పెళ్లికూతు రెవరూ ?

శా:— ఆం. నేను ట్రెయినింగు చెయించిన చంద్రప్రభ లేదు టోయ్, ఆ అమ్మాయి! వినుంటావ్ ?

న:— పెళ్ళంటే శుభమే కాని నువ్వుకూడా భర్తాశ్రమం పుచ్చుకుంటే, నీపని ఏమవుతుందోగదా అని నాకు భయం వేస్తూంది.

శా:—భర్తాశ్రమం భయంకరం అని నీయింట్లోకూడా నీకు అనుభవంగావును, పాపం! పెళ్లి అనేది జరిగిన ప్రతీచోటా ఏదో అక్షింతలుగింజ పడుతూండడం, వ్యక్తుల్ని ఇల్లాంటివాళ్లు అల్లాంటివాళ్లు అంటూ నిరసిస్తూండడం జరుగుతూంటాయిగదా అని నువ్వు హడిలిపోతూన్నట్టు నీమొహం చూస్తే నాకు బోధ పడుతోంది.

న:— కావచ్చు. దుష్టసంబంధప్రసంగాలగురించి గుంజాటన పడుతూ కూచునేవాడు శుంఠ! అది అల్లాఉండనీ కాని, నాకు

సన్ను గురించిన భయం ఏమిటంటే: చిన్నల్కీ పెద్దల్కీ కూడా ఓ తరహాయి అక్షే పెట్టకుండా భర్త అయిన ప్రతీవాణ్ణీ మయ్యా బట్టుగుతే స్వాక్షిని గదా నువ్వు! తుంటర్ల అవసవ్యామేళాల గురించి అంబ్బాం ఎకట గోలచేసి ఏకి ఉపన్యాసిస్తూండడం అనేది నీకు పరిపాటీ, ఆనందమూ అయిం!

శా:— నిశ్చయంగా! ఆమాట పబ్లిగ్గా ఒప్పుకుంటాను.

న:— అందులోనూ నీనోరు!

శా:— సరె, ఊరుకుని ఒట్టి నోరు! దాంపత్యం అవకంలో తప్పు చేసినప్పుడు అందంలో తప్పు ఉంటుందా? ఈ ఊళ్లో ఉన్నంత మంది ఆడారి భర్తల్ని మరో ఊళ్లో చూపిస్తావ్?

న:— నే నెందుకూ? ఆ మరో ఊరూ నువ్వే వెళ్ళి చూసిరా.

శా:— నేను ఏమన్నా ఊరికే చేస్తాననుకున్నావులోయ్! ఉదాహరణకు ఓపాటి గేళ్ల అనుభవంతో గ్రంథంగా రాసేశాను. విన్నావా? ఒక ఆడారి తను డబ్బుగణేస్తూ అది పెళ్లాం రహస్యంగా గుణిస్తూంటే తెలిసి గడుసుగా ఊరుకుంటాడు! మరో ఆడంగి తన పెళ్లానికి బహుమతులు వస్తూంటే అవి అందుకో డానికి గర్వంతో నిలబడతాడు. ఇంకో పెట్టమారి భయంతో భార్యామిత్రుడైన తన శత్రువుకి ఆతిథ్యం ఇస్తాడు. ఒకడు పడుకుంటాడు, ఒకడు ఖర్మం అనుకుంటాడు, ఒకడు ఫిర్యాదు చేస్తాడు, ఒకడు నాగరికతకోసం నమ్మి విధి అనుకుని దగా పడతాడు, వేరే ఒకడు జూదంలో ధనం ఆర్జించినట్టు భార్య చెబితే ఇనప్పెట్టె కొంటాడు.

న:— మహా గొప్ప సంగతులు పోగుచేశావ్, మిత్రమా! జన్మసఫలం చేసుగున్నావ్. కాని, హేళనచేసేవాడు హేళన చెయ్యబడడానికి సిద్ధంగా ఉండాలి. అన్యుల దుష్ప్రవర్తనలు చెప్పుగుని గిలాగే ఆనందించే గొప్పవాళ్లున్నారు.

శా:— ఇటువంటి కబుర్లలో టోకుని గొప్పవాళ్లూ, చిల్లర్ని కొద్దివాళ్లూ యథాశక్తిగా వ్యవహరిస్తారు.

న:— నేను ఇటువంటి అపవాదలగురించి అనుకోను, అనను. ఈరకం సంభాషణ విన్నప్పుడుకుడా దుఃఖిస్తాను.

శా:— (తీసికట్టుగా) దుఃఖిస్తావ్, అదేంఖర్మం! ఎందుకూ?

న:— ఎందుకా! ఒకవేళ నాకే అటువంటి అవస్థపట్టడం కటస్థిస్తే, జనం, నే నంటేకా స్తజాలి పడతారేమో అని! కాని, ప్రతీదంపతుల్నీ తుంటర్లని రాక్షసప్రచారం చేస్తూండే నువ్వు, ఇప్పటిదాకా ఏకాకివి గనక సిరోజు వెడుతోంది. నువ్వుకూడా రేపు దాంపత్యంలో దిగావా, సమయం దొరకడంతోటే, నిన్ను ఉత్త యాగీచేసి ఊరుకోడమే కాదు, జనం, నిన్ను తోక పీకెయ్యగల్రు, నీ బుర్రమీాద వెంట్రుక మొలవకుండా చెయ్యగల్రు, నీ భవిష్యం తీసెయ్యగల్రు, తెలుసా!

శా:— ఒస్, మహా ఘాటుగా చెప్పావే! ఆ మాత్రం ముందుచూపు నాకూ ఉంది. అటువంటి బాధలు నాకు రాకుండా నేను ఇదివరకే కట్టుదిట్టం చేసుగున్నాను. స్త్రీల మాయలన్నీ గమనించి, క్రోడీకరించాను. ఆ మాయల కన్నింటికీ ప్రతిమాయలు కనిపెట్టాను. ఇటువంటి కృషి చేసి ఉన్న నన్ను ఏ స్త్రీ

కూడా దగా చెయ్యాజాలదు. అందులో, నేను పెళ్లాడుతూన్న చంద్రప్రభని దట్టమైనఅమాయిక వాతావరణంలో పెరిగేటట్టు చేశాను.

స:— నీ ఉద్దేశమూ... ఏమీ ఎరగనిపిల్లయితే...

శా.— ఊఁ... అట్టే చిక్కు ఉండవ్! భార్యగడుసుదయితే—నీభార్యలాగ!—అడిగావ్, బాధ! (తలతిప్పుతూ) అబ్బే, గడసరిభార్య వడ్డీవండగవ్యాపారం. తెలివిగల పిల్లలంటూ ఆశపడికొందరుచేసుకున్నారు, అనుభవిస్తున్నారు, చూస్తున్నాం! ఆపిల్లలేమిటో తెలుసా, భర్తలమీద కూడా చలాయింపే, కడంవాళ్లమీద అధికారే! తమ తిండి, తమ డ్రెస్సు, తమ మీటింగులు, తమ ఆటలు, తమ ఆనందం—ఇంతే! పైగా కవిత్వాలు, ప్రణయగీతాలు! పెద్దపెద్దలంతా వాళ్లదర్శనానికి రావడం! "ఫలానావారి మొగుడు ఇతగాడేనర్రోయ్!" అంటూ, మొగుడు వచ్చినాడి పేరు పోగొట్టి హేళన చెయ్యడం. అమ్మ అమ్మ అమ్మ! రామరామ పిల్లలు నాకొద్దు బాబూ! పిల్ల రాత నేర్చిస్తే మొగుడు రాతంతే! నాగృహానికొస్తే పిల్లకి పద్యాం కాదు, ఉత్తిప్రాసలుకూడా తెలియకూడదు. "ఆనందము" అనే మాటకి అనుప్రాసపదం ఏమిటీ అని ఆపిల్లని అడిగితే, "భర్త" అని సమాధానం చెప్పేదిగా ఆపిల్ల ఉండాలి. క్రికెటుమాట, ఆపిల్లకి, ఓ ప్రార్థించుకోడమూ, ఓ భర్తని ప్రేమించడమూ, కుట్టుపనీ, దారం వడకడం తప్ప మరేమీ తెలియకూడదు.

స:— నీ ప్రియురాలు మూర్ఖ స్త్రీ అయి ఉండాలన్నమాట!

న:— మహా గొప్ప సంగతులు పోగుచేశావ్, మిత్రమా! జన్మసఫలం చేసుకున్నావ్. కాని, హేళనచేసేవాడు హేళన చెయ్యబడడానికి సిద్ధంగా ఉండాలి. అన్యుల దుష్ప్రవర్తనలు చెప్పుకుని కిలాగే ఆనందించే గొప్పవాళ్లున్నారు.

శా:— ఇటువంటి కబుర్లలో టోకుని గొప్పవాళ్లూ, చిల్లర్ని గొద్దివాళ్లూ యథాశక్తిగా వ్యవహరిస్తారు.

న:— నేను ఇటువంటి అపవాదలగురించి అనుకోను, అనను. ఈరకం సంభాషణ విన్నప్పుడుకూడా దుఃఖిస్తాను.

శా:— (తీసికట్టుగా) దుఃఖిస్తావ్, అదేం ఖర్మం! ఎందుకూ?

న:— ఎందుకా! ఒకవేళ నాకే అటువంటి అవస్థపట్టడం తటస్థిస్తే, జనం, నే నంటే కాస్త జాలి పడతారేమో అని! కాని, ప్రతీదంపతుల్నీ తుంటర్లని రాక్షసప్రచారం చేస్తూండే నువ్వే, ఇప్పటిదాకా ఏకాకివి గనక నీరోజు వెడుతోంది. నువ్వేకూడా రేపు దాంపత్యంలో దిగావా, సమయం దొరకడంతోటే, నిన్ను ఉత్త యాగీచేసి ఊరుకోడమే కాదు, జనం, నిన్ను తోక కోసెయ్యగల్రు, నీ బుర్రమీద వెంట్రుక మొలవకుండా చెయ్యగల్రు, నీ భవిష్యం తీసెయ్యగల్రు, తెలుసా!

శా:— ఒస్, మా ఘాటుగా చెప్పావే! ఆ మాత్రం ముందుచూపు నాకూ ఉంది. అటువంటి బాధలు నాకు రాకుండా నేను ఇదివరకే కట్టుదిట్టం చేసుకున్నాను. స్త్రీల మాయలన్నీ గమనించి, క్రోడీకరించాను. ఆ మాయల కన్నింటికీ ప్రతిమాయలు కనిపెట్టాను. ఇటువంటి కృషి చేసి ఉన్న నన్ను ఏ స్త్రీ

కూడా దగా చెయ్యజాలదు. అందులో, నేను పెళ్లాడుతూన్న చంద్రప్రభని దట్టమైన అమాయిక వాతావరణంలో పెరిగేటట్టు చేశాను.

న:— నీ ఉద్దేశమూ...ఏమిటా ఎరగనిపిల్లయితే...

శా.— ఊఁ... అట్టే చిక్కు లుండవ్! భార్యగడుసుదయితే—నీభార్యలాగ!—అడిగావ్, బాధ! (తలతిప్పుతూ) అబ్బ, గడసరిభార్య వడ్డీకండగవ్యాపారం. తెలివిగల పిల్లలంటూ ఆశపడికొందరుచేసుకున్నారు, అనుభవిస్తున్నారు. చూస్తున్నాం! ఆపిల్ల లేమిటో తెలుసా, భర్తలమీద కూడా చలాయింపే, కోడం వాళ్లమీద అధికారే! తను తిండి, తను దెబ్బ, తను మీటింగులు, తనపాటలు, తనఆనందం—ఇంతే! పైగా కవిత్వాలు, ప్రణయగీతాలు! పెద్దపెద్దవంతా వాళ్లదర్శనానికి రావడం! "ఫలానావారిఆడమొగుడు ఇడుగోనర్రోయ్!" అంటూ, మొగుడు చచ్చినాక పేరు పోగొట్టి హేళన చెయ్యడం. అమ్మ అమ్మ అమ్మ! రాకుమారి పిల్ల నాకొద్దు బాబూ! ఇల్లు రాత నేర్పిస్తే మొగుడు రాతంతే! నాగృహానికి కాబోయే పిల్లకి పద్యం కాదు, ఉత్తరం వ్రాయటం కూడా తెలియకూడదు. "ప్రాసయు" అనే మాటకి అనుప్రాసపదంఏమిటి అని ఆపిల్లని అడిగితే, "భర్త" అని సమాధానం చెప్పేదిగా ఆపిల్ల ఉండాలి. క్లుప్తంగా, ఆపిల్లకి, ఓ ప్రార్థించుకోడమూ, ఓ భర్తని ప్రేమించడమూ, కట్టుబడి, దారం వడకడం తప్ప మరేమీ తెలియకూడదు.

న:— నీ ప్రియురాలు మూర్ఖ స్త్రీ అయి ఉండాలన్న మాట!

శా:—అక్షరాలా! అందులో ఎంత కురూపిఅయి కూడా ఉంటే అంత మంచిది. అల్లాగనక ఉంటే, తెలివీ రూపమూ ఉండేకంటె లక్షనయం.

స:—(ఆశ్చర్యంతో) తెలివీ రూపమూనా కూడదూ!

శా:—ఎందుకోయ్ అవన్నీనూ! సుగుణం చాలదుటోయ్, సఖీ!

స:—సరే, నువ్ చెప్పిన జంతువులాంటి స్త్రీకి నీతి అంటె మాత్రం ఎల్లా తెలుస్తుంది! పిసిగె త్తకుండా ఇల్లాంటి మనిషితో నవ్వ ఉండటం ఎల్లా? అంతేమూర్ఖపు మనిషి, నీకే అనకోకుండానూ, కోరుకోకుండానూ కూడా నీతి తప్పితే, అప్పుడే గోతులో దిగుతావ్ నువ్వూ!

శా:—ఇల్లాంటి వాదనకి నా సమాధానం ఏమిటంటే, నువ్వే నోరు నెప్పెట్టేటట్టు వాగినా సరే, నీవాదన నాకు నచ్చటం లేదు అనేసి ఊరుకోడం!

స:—అయితే మరి వాదించను, నీయత్నం కొనసాగించు.

శా:—ఎవడి యత్నం వాడిది. నా రాబోయేభార్య గురించి నాఏర్పాటు ఆచరణలో పెట్టించాను. నాది గొప్ప వంశం, మంచి ఆస్తి! కులమర్యాదా, ఆస్తిగర్వమూ రెండూ ఉండీ, క్షణానికోసారి నన్ను దెప్పి పొడవడానికి వీల్లేకపిల్లని ఏరాను. ఆపిల్లని నాలుగేళ్ల వయసప్పుడు దారిద్ర్యంవల్ల తల్లి నాకిచ్చేసింది. ఒక ఏకాంతమఠంలో చేర్పించి ఆపిల్లకి ఈ పదిహేనేళ్లనించీ పరమాజ్ఞానంలో మాంచి ట్రైనింగు ఇప్పించాను. ఇప్పుడూ తీసుగొచ్చాను. నాభవనంలో వచ్చేవాళ్లూ వెళ్లేవాళ్లూ గనక

దూరంగా అవతల వీధులో ఎర్ర స్తంభాలమేడ వుచ్చుగున్నీ ఆ పిల్లని అందులో పెట్టి, మూర్ఖులైన నాళ్ళని అక్కడ ఉంచాను. ఎంత జాగ్రత్త చేసుకున్నానో చూడు!

న:—అద్దమా!

శా:—చూడూ, రాత్రి భోజనానికి ఇక్కడికిరా! మాటా పలుకూ ఆడుకుంటూ భోజనం చేద్దాం.

న:—అవశ్యం.

శా:—ఆ పిల్ల ఎంత అమాయికురాలో నువ్ కూడా చూసి సంతోషిద్దువుగాని!

న:—నువ్ చెప్పావుగా!

శా:—ఏంచెప్పడం! ఆ అమాయికత్వం కళ్లారాచూడాలి, బోధపడాలి. (కులుకుతూ) ఒక్కొక్కప్పుడు అమాయిక సమాధానం చెప్పిందంటే వినేవాళ్లకి డొక్కలెగ్గద్దలై పోతుంది. మఠంలోంచి ఇవతలకి రాగానే, అందంగా పోతవిగ్రహంలాగ ఉన్న ఓ అమ్మాయినిచూసి, ఈపిల్లనాతో ఏమందోవిన్నావా!..."ఆ అమ్మాయిని ఎక్కడేనా చెయించారో లేకపోతే చెక్కించారో కనుక్కోండీ!" అంది.

న:—ఆహా, చాలా సంతోషంగా ఉందయ్యా, శానయ్యా!

శా:—అదుగో, మళ్లీ నన్ను నువ్వు "శానయ్యా" అంటూ ఆ వెనకటిపేరుతోనే పిలుస్తావే! "అరుణాచలం" అనలేవూ?

న:—ఓహో, అదా! అరుణాచలమా! పాతపేరు పెదిమిలికి అలవాటు. కొత్తగా తెచ్చి పెట్టుగున్న పేరు స్మరణకి రాదు.

ఇంత వయస్సులో యీ భైరవో పడిలో నీపేరు ఎందుకు మార్చుగున్నావో ఎవ్వరికీ తెలియదు.

శా:—ఎందుకో ఒకందుకు. నాయిష్టం. పాతపేరునాకు కోపం.

న:—ఇంకా ఉత్తరాలుకుడా నీ పాతపేరుతోనే వస్తున్నాయేమో!

శా:—ఎరగనివాళ్ల దుండగాలు సహిస్తాను. నువ్వు ఎరుగున్న వాడివికదా! నువ్వు తిన్నగా అందూ!

న:—సరే. ప్రయత్నిస్తాను. పోతాను అయణావలం! (అని ఎడమఎవరకి పోతాడు)

శా:—(ఎడమమధ్యకి చూసి) ఒరేయ్, మాలోకం!

మా:—(వస్తూ) ఆ...య...

శా:— ఇందాకా అక్కడికెళ్లి చూసొచ్చావా?

మా:— చూసొచ్చానండి.

శా:— ఎక్కడికెళ్లి చూసొచ్చావ్?

మా:—(ఎడమవెనకకేసి చూపెట్టి) ఆ వేపునున్న ఎర్ర స్తంభాలమేడకి.

శా:—ఏం జేస్తోంది ఆపిల్ల?

మా:— నేనూ వెళ్లేవరికి, సరిగ్గా, ఎవో చెయ్యాలనుకుంటున్నారండి, ఆవిడ.

శా:— అబ్బ, అనుకోడంకాదురా, ఏం పని చూస్తోంది ఆవ్యక్తి?

మా:— మీకు మందిటోపీ అల్లుతున్నారండి.

శా:— భేష్. నేను ఊర్నించి వచ్చానని చెప్పావా?

మా:— చెప్పానండి.

శా:— (కనుబొమ్మలు ఎత్తి) చెప్పగానే ఆ అమ్మాయి సంతోషించిందిరా!

మా:— నా దుంప తెగా, నే నామాట అడగడం మరిచి పోయానండి.

శా:— ఓరి పశువా, మాటకి మాట జేర్చి కనుక్కోవద్దుట్రా? ఏడిశావులే!...ఊఁ...ఈ పదిరోజుల్నించీ కులాసాగా ఉన్నారంటా?

మా:— (తల తిప్పుతూ) కులాసాగానే ఉన్నార్టండి. కాని (మొహం ముడుచుకుని) రాత్రెళ్లు పీక దోమలుట!

శా:— అల్లాగా! వెధవ దోమలులే. వాటిని తోలడానికి దాసీని పెట్టిస్తాలే. అంతేనా, మరేమన్నా ఉందా?

మా:— అంతేనండి.

శా:— (సిగ్గుతో) మా—లో—కం!

మా:— (దణ్ణం పెట్టి) ఆయ్.

శా:— నేను పదిరోజులాయె లేనుగదా, (తల రుద్దుతూ కళ్లు మిటకరిస్తూ చిరునవ్వుతో) నాకోసం ఆపిల్ల బాధపడేదిరా?

మా:— తెగ బాధపడ్డారండి! నేచచ్చినంతఒట్టండి. అసలు ఆమేడపక్కనించి ఏగుఱ్ఱం, గాడిద, కంచరగాడిద — ఏది వెళ్ళినా సరే ఉలిక్కిపడి, ఒకవేళ వచ్చింది మీరేమో అని చూస్తూండేవారు.

శా:— అల్లానా! చూస్తూఉండేదేం పాపం! ఔర! ప్రేమ గావును! (అని తల ఊగిస్తూ)...ఆగు... (ఎడమ ఎదరకేసి నిదానిస్తూ) ఎవరోనాకోసం వస్తున్నారు. నవ్ తప్పుకో!

(ఎడమ ఎదరనించి "ఏమండోయ్" అని కేక వినపడుతుంది.)

మా:— (ఎడమమధ్యకి పోతాడు.)

నీ:— (ఎడమ ఎదర్నించి వచ్చి) ఏమండోయ్, శాం...

శా:— (దీర్ఘంగా ముఖంకేసి చూసి ఆశ్చర్యంతో) ఆఁఆఁ... నీహారం! అవునా!

నీ:— అవునండి, శానయ్యగారు!

శా:— చాలా సంతోషం. రా, కూచో. ఎన్నాళ్లాయి వచ్చావ్, ఈఊరూ?

నీ:— ఓ వారం అయింది.

శా:— అబ్బా. అల్లానా!

నీ:— ఎప్పటికప్పుడు ఇక్కడ మిమ్మల్ని కేకేసేవాణ్ణి. లేరనేవారు.

శా:— పొలాలమీది కెళ్లాను ఈమధ్య!

నీ:— పదిరోజులైందిగావును మీరెళ్లి!

శా:— అవును. కిందసమాటు చూసినప్పుడు నువ్వు (పొట్టి అని నేలమీంచి ఎత్తు చూపిస్తూ) ఇంత ఉండేవాడవ్, ఎదిగావున్నీ!

నీ:— అయిఉంటుంది.

శా:— సరే, నాన్నగారు — శాటయ్యగారు క్షేమమా?

నీ:— ఆ, మీ దయవల్ల.

శా:— ఆయన నాకు చాలా స్నేహితుడు. కొన్నాళ్లాయె మేం కలియలేదు.

నీ:— ఉత్తరాలుకూడా రాసుగోలేదేమో!

శా:— లేదు. ఆయన ఇంకా చలాకీగా నవ్వూ ఆడి చూస్తున్నారా?

నీ:— ఆ. మీకో ఉత్తరం రాశారు. ఇదుగో. (అని ఉత్తరం ఇస్తాడు.)

శా:— ఓ. ఆయనమాట శిరసావహిస్తాను. నువ్వు ఉత్తరం కూడా తేవాలీ ఆయనదగ్గిర్నించీ! కాకిచేత కబురంపిస్తే ఆయనపాదాలదగ్గర వాలనూ?

నీ:— నిజమే కావచ్చు కానండీ, పరిచయం కలిగించుకోకుండా వ్యక్తుల్తో వ్యవహరించే అలవాటు నాకు లేదు... మరో ఉత్తరం రాశారు.

శా:— ఎవి?

నీ:— తీసుకురాలేదు. మానాన్నకి పెద్ద స్నేహితుడున్నాడట. సంతోషంట ఆయన పేరు. ఆయన్ని మీరెరుగుదురా?

శా:— ఎరగను.

నీ:— అల్లానా! అయినా భయం లేదులెండి. ఆయన దేశాంతరంనించి వచ్చాడట. వాళ్లిద్దరూ ఒక ముఖ్యమైన పని మీద ఇక్కడికి వస్తున్నారట, నేడో రేపో!

శా:— అవశ్యం వారికి స్వాగతం ఇస్తాను. ఇవ్వడూ

వంగతేమిటీ?

నీ:— నాకు ఒక నూరురూపాయలు కావాలి.

శా.— సంతోషంగా ఇస్తాను. (అని కుడిమధ్యకి వెళ్లి అప్పుడే వచ్చి) ఇదుగో, ఈసంచీతోకుడా పుచ్చుగో. నేను కాటయ్య గారి పుత్రుడికి సమయానికి అనుకూలించడంకంటె నా కేం కావాలీ!

నీ:— మీకు ఇది మళ్లీ...

శా:— అబ్బ...అల్లా ఉండనిస్తూ, చూసుగోవచ్చూ! ... సరి, నీకు ఈ ఊరెల్లా ఉంది?

నీ:— మంచి జనం, మంచి భవనాలు, మంచి వినోదాలు- చాలా బాగుందండీ?

శా:— అందులోనూ, ఎవరి అభిరుచికి తగ్గ వినోదాలు వారికి దొరుకుతాయి, ఇక్కడ! ఇక్కడి స్త్రీల రకాలు చూశావా? (అని స్మితం చేస్తాడు)

నీ:— కొంచెం చూశానండి.

శా:— ఇక్కడి స్త్రీలు సహజప్రౌఢలు కావడంచేత రసిక శిఖామణుల కోరికలకి ఇక్కడ పంట' వ్యక్తులే వ్యక్తులు, వేషాలే వేషాలు, చేష్టలే చేష్టలు—అంతా నవీననాటకంతంతు! ఇంతట్లో ఏంచూశావ్, ఈ మహానగరంమజా! నువ్వా స్ఫురద్రూపివి. నిలువెత్తుధనం పోస్తే దొరుకుతాడా నీబోటిగాడు? నిన్ను చూసింతరవాత ఏ మిటారిభార్య మనస్సు పట్టగలదూ? నీకు కుదిరిందా ఎదేనా బేరం? నీ వ్యాపారం జయకరంగా ఉందా?

నీ:—(తల వంచి, చేతులుకట్టి, కాలు ఆడిస్తూ) ఒక నేరం జరిగిందండీ. తమరు పెద్దలు ఎల్లా చెప్పడంమరి!

శా:— సరిసరి. (వెళ్ళి భుజం తట్టి) నాన్నా నేనూ స్నేహితులం, చెప్పవోయ్! నేను మరో ఉదాహరణ నా గ్రంథంలో రాసుకుంటానూ!

నీ:— మీరు ఈసంగతి రహస్యంగా ఉంచాలి.

శా:— తప్పకుండా!

నీ:— ఇల్లాంటి రహస్యాలు పొక్కితే, అసలు వాళ్ళ ఆశలన్నీ తుడిచిపెట్టుకుపోతాయి అని మీకూ తెలుసు గదా! వినండి, మరి దాచకుండా చెప్పేస్తాను. ఒక సుందరిమీదకి నా మనస్సు వాలింది. నా ప్రథమ సూచన్నవల్ల పని జరిగింది. ఆవ్యక్తి నాకు స్వాగతం ఇచ్చింది. ఒడాయీ కాదు, ఆవిణ్ణి యోగీ చెయ్యడమూ కాదు గాని, వ్యవహారం బాగానే నడుస్తోంది.

శా:— బలేబలే! (అని నవ్వుతూ) ఎవరోయ్, ఆ భువన సుందరి?

నీ:—(ఎడమమూల చూపించి) ఆవేపున ఎర్రస్తంభాల మేడలో ఉంది ఒక పిల్ల—అసుందరి! ఆవిడ చాలా అమాయకురాలు. ఎవడో తెలివిమాలినవాడు ఆవిణ్ణి ప్రపంచానికి దూరం చేసి అల్లా తయారు చేశాడట. అయినా సరే ఆవిడయొక్క మహత్తరమైన ముఖతేజమూ, మనోహరమైన దృష్టివైఖరీ జనాన్ని ఆకర్షిస్తాయి, నన్ను లాగేశాయి! ఆమెపేరు చంద్రప్రభ. ఆమె ప్రేమనిధి, ప్రణయతార.

శా:—(కళ్ళు తేలేసి పక్కకి తిరిగి దిగాలుపడి) అయ్యో అయ్యో! నా మొహాన్ని బట్టి పోల్చుకోడుకద!

నీ:—(చేతి రుమాలు తీసి ముఖం అద్దుకుని) ఇక, ఆవిణ్ణి తెచ్చినవాడు ఘర్ణాచలమో కర్ణాచరమో ఎదో పేరటండీ. వాడికి డబ్బుందిట గాని, బుద్ధిలేదని విన్నాను బుద్ధి లేకపోడం లోనూ ఎల్లా అనుకున్నారూ, పరిపూర్ణ మూర్ఖుడనే తెలిసింది. మీరెరుగుదురండీ వాణ్ణి!

శా:—(తనలో) ఈ చేమమాత్ర ఎల్లా మింగడం!

నీ:—ఎరుగుదునా లేదా అని ఆలోచిస్తున్నారా ఏమిటి?

శా:— లేదులేదు...వా...ణ్ణి...ఎరుగుదును....

నీ:— వాడు పరమశుంఠ కాడంటారా?

శా:—(నోరు వెళ్లబెట్టి) హెం (అని ఏడిచినట్టునవ్వి అవు నన్నట్టు తల ఊగిస్తాడు.)

నీ:— అవునా, నిజమేనాండి, అదే నే విన్నదీనూ! ఆ కాకికి ఓ దొండపండా? ఆ మసిపాతని ఓ వజ్రమా? నేను ఒప్పను. ఆవిడ నాహృదయాన్ని హరించింది. ఎంత పనేనా చేసి, ఆ అను మానవు యజమాని కంటో దుమ్ముచల్లి, ఆవిణ్ణి నేను చేపట్ట డం నాకు విధి.

శా:— (ఏమీ తోచక) అల్లానా! నీకు వీలుకావద్దూ!

నీ:— సరే, వీలంటే డబ్బండీ! అందుకోసమే ఇప్పుడు మీ దగ్గిర డబ్బు తీసుగుంటా!...అయ్యా, ప్రేమయుద్ధం కానీండి, ద్వేషయుద్ధం కానీండి, నెగ్గాలంటే కీలకం డబ్బే!...మీరు

ఎల్లానో ఉన్నారు...పోనీ, వెళ్ళి మళ్ళీ రానా!

శా:— అబ్బెబ్బే, నే నేమని ఆలోచించానంటే...

సీ:— మీరు చాలా అలిసినట్టున్నారు. మళ్ళీవచ్చి సంగతి చెప్పిపోతాను. కృతజ్ఞుణ్ణి. సెలవ్ (అని ఎడమ ఎదంకి వెళ్ళిపోతాడు.)

శా:— అయితే...విధిగా...

సీ:— మరే, విధిగా ఈ రహస్యం మీరు దాచాలి. (అని వెళ్ళిపోతాడు)

శా:— నా చిత్తవృత్తినిబట్టి...

సీ:— (మళ్ళీ వచ్చి) అన్నిటికంటె ముఖ్యం ఏమిటంటే, మా నాన్నతో ఇది మీరు అననేకూడదు. జాగ్రత్తసుమండీ, ఆయనకి కోపం రావచ్చు. (అని ఎడమ ఎదరకి నిష్క్రమిస్తాడు.)

శా:— (సీతారం వెళ్ళిన వేపు చూస్తూ) హరోరి! నా మనస్సుకి సంక్షోభ కలిగించావురా చచ్చినాడా! నీ సంభావణ తగలెయ్యా!...పైగా అందుకోనమేట నా దగ్గిర డబ్బు తీసుకుంటా! వీడి పొగరూ, వీడి తొందరా వీడి ఎదంలానే ఉన్నాయి. లేకపోతే, ఈ కథట్టుగొచ్చి నాతోనా చెపుతాడు వీడు! నా కొత్తపేరు ఎంత తెలియకపోయినా ఇంత చవట కుంకలాగ దూడేనేవాడు మరి ఉండడు. కాని, ఈదౌర్భాగ్యుణ్ణి చివరదాకా పేలనియ్యవలసింది, ఏం కూసేవాడో! నా భయాలన్నీ యథార్థం అని తేలిపోయేదేమో!...

(దీనంగా) వీళ్లకి మాటలుకూడా జరిగాయేమో పీనుగులు! సరే, ఓపని చేస్తా. మెల్లిగా బెల్లించి, వీడికి మనస్ఫుచ్చినట్టు నటించి నమ్మకంపుట్టించి, అరుణాచలం అనేది నే పెట్టుగున్న పేరే అని వీడికి తెలియకుండా జాగ్రత్తపడి, గ్రంథం యావత్తూ లాగేస్తా. అమ్మకుంకా!... కాని, ముందు ఈ మాలోకంగాణ్ణి తన్నాలి. ఒరేయ్! మాలోకం!

మా:— (ఎడమమధ్యనించి వచ్చి నవ్వుతో) ఏమండి అయ్యగారు!

శా:— నీ చావు మూడిందిలే, దగ్గిరికిరా! (అని అరుస్తాడు)

మా:— (బిక్కమొహంతో) మిమ్మల్ని చూస్తే భయం వేస్తోందండి. (కొట్టినట్టు ఏడుస్తూ) బాబో బాబో!

శా:— గోల చెయ్యకు. దగ్గిరికిరా. రావేంరా? (అని పళ్లు కొరుకుతాడు)

మా:— మరి చంపేసేట్టున్నారండి.

శా:— అప్పుడే చంపను, ముందు చెప్పు. నే ఊళ్లో లేనప్పుడు, నే చెప్పినప్రకారం చేస్తానని నన్ను దగాచేస్తావురా?

మా:— నేను దగా చెయ్యలేదండి, అసలు ఏమీకూడా చెయ్యలేదండి. (అని వెనక్కి వెళ్లబోతాడు)

శా:— అదేమిటి, వెనక్కి నడుస్తున్నావా! పారిపోతే వరనా! పారిపోతే ఏం జేస్తానో తెలుసా? వెంటనే చాకుతో పొడిచేస్తాను...(మూలుగుతూ) అయ్యో! నే బాధలో ఉన్నానురా, దిక్కుమాలాడా, మాట రావటంలేదు నాకూ, కంఠం

త్రంభిస్తోంది. (గట్టిగా) కదలావంటే చంపేస్తా. ఆగు. (ఉడుకుమోత్తనంతో) కూసం విడిచినట్టు శరీరం విడిచెయ్యాలని ఉంది నాకు! కాని, ఏళ్లేదాయిరి! (తాపీగా) నే లేనప్పుడు, చంద్రప్రభ మేడమీదికి, మనిషిని వెళ్లనిచ్చావా లేదా? కదలకు. కదిత్తే పోతావు స్వర్గానికి. చెప్పు. అసలు వాడెల్లా ప్రవేశించాడు, లోపల?

మా:—(మోకరించి దణ్ణం పెడుతూ) ఒట్టండి, ఒట్టండి... (తనలో) ఈయన్ని ఏ పిచ్చికుక్కో కరిచింది.

శా:— అబ్బబ్బ, కోప వస్తోంది. నర్దుకుని నిదానించాలి... ఒరేయ్ నువ్వెళ్లి...పోన్లే వద్దు. అవతలికిపోయి కూచో.

మా:—అంత కోపం ఏమిటండీ! (అంటూ సణుక్కుంటూ ఎడమమధ్యకి పోతాడు)

శా:—(లేస్తూ) ఆ కుర్రకుంక ఇల్లాంటి అసాధ్యం నాకు తెస్తా డనుకోలేదు. నా గుండె పిండైపోయింది. అయినా తప్పదు. ఈ పాడువ్యాపారంలో నిజం ఎంతవరకో దాని నోటంటే వింటాను. నేను కోపం చంపుగోవాలి, చంపుగుంటాను మరి. అకస్మాత్తుగా వెళ్లి ఆ పిల్లని అడిగేస్తాను. (గుండెలు బాదుకుంటూ) హాయ్యో హాయ్యో! చిన్నకుర్రాడ వనుకున్నాన్రా కాటయ్యగారినుపుత్రుడా, నా కొంప తీశావురా, అభాజనుడా! (అంటూ ఉసూరుమని కాళ్లీడుస్తూ కుడిమధ్యగా నడిచిపోతాడు)

## 2వ రంగం

చంద్రప్రభని పెట్టిన మేడ.

శా:—(కుడివైపునించి వచ్చి ఎడమమధ్యకేసివెళ్లి) చంద్రప్రభా! (అని పైకి చూసి పిలిచి) కిందికిదిగి ఇల్లా రా!

చం:—(ఎడమమధ్యనించి వస్తుంది)

శా:—ఇవతల హాయిగా లేదూ!

చం:—(నవ్వుమొహంతో) ఉంది.

శా:—గాలి సుఖంగా ఉందిస్మీ!

చం:—చాలా.

శా:—విశేషాలేమిటి!

చం:—పిల్లి పిల్ల చచ్చిపోయింది.

శా:—పిల్లిపిల్లలు చచ్చిపోతూంటాయిలే, ఎంజేస్తాం!... నే లేనప్పుడు వర్షం కురిసిందా!

చం:—చూడలేదు.

శా:—నీకు ఉసూరుమనిపిస్తోందా?

చం:—నా కెప్పుడూ ఉసూరుమనిపించదు.

శా:—ఈ పదిరోజులూ యేం, ఏమేం జేశావ్?

చం:—ఆరు చొక్కాలు కుట్టాను, ఆరు టోపీలు అల్లాను.

శా:—(ఎడమమధ్యకి వెళ్లి చిన్న కుర్చీ తెచ్చి ఎడమవైపున వేసి చంద్రప్రభని కూచోమని సంజ్ఞచేసి, ఇంకోటి తెచ్చి పక్కగా వేసుకుని తను కూచుని) ఈ ప్రపంచమంతా అదో చిత్రం సుమా, చంద్రప్రభా!

చం:— ఎంచేతా !

శా:— ఎవళ్లు మాట్లాడినా అపవాదలే మాట్లాడతారు.

చం:— ఎవళ్లు వాళ్లా !

శా:— ఒకళ్లేమిటీ, అంతానూ! నే లేనప్పుడు ఇక్కడికి ఒక యువకుడు వచ్చినట్టూ...

చం:— ఊఁ.

శా:— నువ్వు వాణ్ణి రావిచ్చి వాడితో ప్రసంగించినట్టూ... చుట్టుపక్క వాళ్లు...

చం:— ఊఁ.

శా:— కొందరు చెప్పారు. అయితేం? (చిరునవ్వుతో) నేను ఏమీ నమ్మలేదు. ఎవడూ రాలేదని, కావలిస్తే, పందెం కాస్తా నన్నాను.

చం:— (నవ్వుతూ) కాశారు కాదు నయమే, కాస్తే, మీరే ఓడిపోయి ఉందురు.

శా.— అయితే, నిజంగా, ఒక యువకుడు రావడం...

చం:— (చలాకీగా) ముమ్మాటికీ నిజం! ఆతడు వచ్చి ఓవట్టాన వెళ్లందే నా!

శా:— (తనలో) అల్లా తెగేసి పబ్లిగ్గా చెప్పేస్తుం దే! నిమ్కళ్మషం అన్నమాట. (పైకి) అయితే ప్రభా! ఎవళ్లనీ నువ్వు చూడకూడదని నేను ఆర్డరు వేశానే!

చం:— నే నెందుకు చూడవలిసొచ్చిందో మీ రెరగరు. ఎరుగుంటే, మీరూ అంతేచేసి ఉండేవారు.

శా:-- అదోటా! సంగతేమటో చెప్పు.

చం:-- నే మేడమీదపని చూసుకుంటున్నాను. అతడు కింద నిలబడి, నేను తనకేసితిరగ్గానే చేత్తో (నుదురు మట్టుకుంటూ) ఇల్లా అన్నాడు. ఊరుకుంటే మర్యాదకి భంగం అనుకుని నేనూ (అభినయిస్తూ) ఇల్లా అన్నాను. అతడు వెళ్లి మళ్లీవచ్చి (అభినయిస్తూ) ఇల్లా అన్నాడు. మోటుమనిషిని కానని దాఖలాకోసం నేనూ (అభినయిస్తూ) ఇల్లా అన్నాను. అతడు మళ్లీమళ్లీ వచ్చి (అభినయిస్తూ) ఇల్లానే అన్నాడు. చీకటి పడడంవల్లగాని, లేకపోతే అతనూ నేనూ (అభినయిస్తూ) ఇల్లా ఇల్లా అంటూ ఉండిపోయేవాళ్లమే!

శా:— (తనుకూడా తన నుదురు మట్టుకుంటూ) ఇల్లానే ఉంది సరిగ్గా!

చం:— మొన్నాడు పొద్దున్న ఎరుగులాంటి ముసిల్ది ఒకత్తె వచ్చి, దేవుడు నాకు అందం ఇవ్వడం వ్యర్థంచేసుగోమని కాదూ, అంది. పైగా, నేను ఒక హృదయాన్ని గాయపరిచానంది.

శా:— గాయపరిచావందీ! (తనలో) అసి సైతాను సకిలీ ముసిలీ!

చం:— నే నేమీా వినరందే గాయం ఎల్లా పడిం దన్నాను. అంటే, ముసిల్ది: నీ కళ్ళల్లో ఉంది సంగతంతాను. నవ్వేకళ్లతో చూపులు విసిరావు. బహుశా కళ్లవిషం అతనికి ఎక్కిగుండెని గాయపరిచింది గావును. దాంతో అతడు మూర్ఛిల్లాడు, రెండు రోజుల్లో చచ్చిపోతాడు—అని చెప్పింది.

అయ్యోయ్యో, పాపం అత్త ఎల్లా బతుకుతా ఉన్నాను నేను. అంటే, దాని ధర్మంగా అని ఆ ముసలమ్మ ఓ ఉపాయం చెప్పింది.

శా:— ఉపాయంకూడా చెప్పిందీ! (తనలో) దాని ఉపాయాన్నీ దాన్నీ వేరేవేరే తగలేసి, దాని మొహం మండా!

చం:— నీ కళ్లల్లోనే అతణ్ణి రక్షించే మందు ఉంది. అతణ్ణి రానిచ్చి అతన్తో మాట్లాడు—అంది. నేను సరే అన్నాను.

శా:— (తనలో) ఆసి మహమ్మారి ముసిలీ. నీకు నవ్వార్ కట్టా, నీకు నరక మేసే పీనుగా!

చం:— అతణ్ణి రానిచ్చాను. అల్పప్రాణి గురించే బాధ పడతాను కదా, అంత నిండు ప్రాణం నామూలాన్ని పోతూంటే ఊరుకోనా!

శా:— (తనలో) అమాయకత్వంవల్లే వచ్చింది ఈ చిక్కు! అదీ కాదు. నేను తెలివిమద్దెపు చవటని కాకపోతే, దీన్ని ఒంటరిగా వొదిలి ఊరి కెడవడం ఏమిటీ! మానగాళ్లు కనిపెట్టాను...ఆ కుంక మరేమీ హద్దుమీరలేదుగదా అని భయం వేస్తోంది.

చం:— మీరెల్లా ఉన్నారే! విసిగెత్తిందా! నేచేసినదాన్లో తప్పు ఏమన్నా ఉందా?

శా:— (కొంచెం ఉత్సాహం తెచ్చిపెట్టుకుని) అబ్బెబ్బె! తప్పు లేదు, తప్పు లేదు. ఆ యువకుడు ఏమన్నాడు, ఏం చేశాడు?

చం:— చాలా సంతోషించా నన్నాడు.

శా:— (తనలో) వెధవ.

చం:— తన వ్యాధి పోయిందన్నాడు.

శా:— (తనలో) రోగం, దిక్కుమాలాడికి.

చం:— (నవ్వుతూ) నా కతడు తెచ్చిన బహుమతీ, మా లోకానికి అతడిచ్చిన డబ్బూ ఇవన్నీ చూస్తే, మీరతణ్ణి ఎంతో మెచ్చుగుని...

శా:— నేనూ అతణ్ణి ఏకంగా చివరకి మెచ్చుతాలే, ఇంకా చెప్పు.

చం:— నన్ను ప్రేమించా నన్నాడు. అల్లా ఎవ్వర్నీ లోకంలో ప్రేమించలే దన్నాడు. మనోహరమైన సంగతులు చెప్పాడు. అవన్నీ వింటూంటే నిజంగా, ఒళ్ళు గగుర్పొడిచిం దండీ. నమ్ముతారో లేదో, నేను పుట్టింతరవాత అటువంటి క్షణం ఎరగనండీ.

శా:— (తనలో) ఘోర, దుర్దశ! సమాధానంవల్ల బాధపడేది నేనొక్కణ్ణే, ప్రశ్న అడగవలిసొచ్చింది నేన! (పైకి) అది సరే చంద్రప్రభా! మాటలు సరి. ఇంకా నిన్ను గౌరవించలేదూ వాడూ!

చం:— నా చెయ్యి ముద్దుపెట్టుగున్నాడు. అతడికి వినుగే లేదు.

శా:— ఇంకా ఏమైనా తీసుకున్నాడా!

చం:— ఆ...(ఏదో జ్ఞాపకం చెయ్యడానికి లాగ తర్జనితో

వెనక్కి సూచిస్తుంది.)

శా:— (కోపంగా) ఏమిటి!

చం:— అతడు...

శా:— అయ్యో!

చం:— ఆ...

శా:— చెప్పు.

చం:— (చెప్పబోయి) ఏమో! మీరు కోప్పడేట్టున్నారు.

శా:— కోప్పడను.

చం:— ఒట్టే?

శా:— ఒట్టున్నర.

చం:— అతడు ఏం తీసుగున్నా డంటే, ఆ...మీకు కోపం లేదుగద!...

శా:— లేదు.

చం:— (మూతి ముడుచుకుని) పోన్లెండి, కోపం గావును!

శా:— కోపం లేదు, లేదు, లేదు! చంపక చెప్పెయ్!

చం:— అతడు...(అని గుటక వేస్తుంది)

శా:— (తనలో) దైవమా! ఏమిటో అనుకున్నాను గాని, నరకం చూడ్డానికి వేరే చావక్కర్లేదు.

చం:— అబ్బ వినండీ. మీరు నా జడకి ఓ కొత్త రిబ్బను కొన్నారే, ఆ కొత్త రిబ్బను అతడు తీసుగుపోయాడండి! వద్దంటే విన్లేదు.

శా:— ఇక్కడికి చంపేశావ్! దిక్కుమాలి రిబ్బన్లేస్తూ

టిక్కెమాలి రిబ్బనూ! సరే. ఇంకా ఏమి తీసుకున్నాడు?

చం:— ఇంకా ఏమనుంటుంది?

శా.— రోగం కాను వాడికీ, అది కుదరడానికి, ఏం కోరు కున్నాడని!

చం:— అతను మరేమీ కోరలేదు. ప్రాణాపాయం తప్పిపో యిందిగా!

శా:— చాలు చాలు, ఇక్కడికి కృతార్థులమే. నువ్వొకగవు ప్రభా! మోసగాళ్లు ఇల్లానే చేస్తారు. మొదట ఇల్లానే స్తోత్రాలు చేసి, తరవాత హేళన చేస్తారు.

చం:— అబ్బే! ఇది మోసం కాదు, స్తోత్రం కాదు, హేళన కాదు—అని అతను బోలెడుసార్లు చెప్పాడు.

శా:— అయినాసరే ప్రభా! చెబుతున్నాను. నువ్వు ఎవ్వళ్లనీ నమ్మకూడదు నన్నుతప్ప! పైగా సలాములు, చూపులు, బహుమతులు, వినోదాలు, స్పర్శలు, ముద్దులు—ఇవన్నీ ఘోరమైన పాపాలు! జాగర్త.

చం:— పాపాలా? అయ్యో! ఏం?

శా:— అవన్నీ అంటే దేవుడికి మహాచెడ్డ ఒళ్లుమంట!

చం:— ఇంత మధురం, ఆకర్షణీయం అయిన వ్యవహారం గురించి దేవుడికి అంత ఒళ్లుమంట ఎంచేతా?

శా:— ఈ వ్యవహారం మధురమూ, ఆకర్షణీయమూ అనే సంగతి నాకు చెప్పనక్కర్లేదు, నాకూ తెలుసు. కాని, అది నియమప్రకారం ఉండాలి. లేకపోతే చాలాదోషం. తెలిసిందా?

పెళ్లితో ఆ దోషం పోతుంది.

చం:— పెళ్లితో ఆ దోషమే ఉండదూ ?

శా:— ఉండదు.

చం:— అల్లాయితే పెళ్లి కానియ్యండి.

శా:— నువ్వు కోరేది పెళ్లే అయితే, నేకోరేదీ పెళ్లే ! నేను పెళ్లిగురించి చెప్పేద్దామనికే వచ్చానసలు !

చం:— (సంతోషంతో) నిజంగానాండీ !

శా:— (సంతోషంతో) నిజంగా.

చం:— నాకు ఎంత సౌఖ్యం ఇచ్చినవారవుతారనుకున్నారు మీరు !

శా:— పెళ్లి నీకు సంతోషదాయకం కాక పోతుందా అని అంచనా వేశాను.

చం:— అల్లాయితే, ఇద్దరమూ...

శా:— నిస్సందేహంగా...

చం:— ఆ సంగతే నిజమైతే, సంతోషంతో మిమ్మల్ని లాలిస్తాను.

శా:— నేనూ అంతే. ఆనందంతో నిన్ను లాలిస్తాను.

చం:— (తొందరగా) నిజమేనండీ ! వేళాకోళం అంటే నాకు తెలియదు చెప్పండీ ! మీరు మనసారా...

శా:— అవును. మనసారా చెబుతున్నాను.

చం:— పెళ్లిమాట రూఢే అంటారా ?

శా:— అవునంటే ! రూఢి.

చం:— అయితే, ఎప్పుడూ?

శా:— ఈ సాయంత్రమే.

చం:— (నవ్వుతూ) అహాఁ, ఈ సాయంత్రమే?

శా:— ఆ. కేవలం ఈ సాయంత్రమే. అంటే, నీకు నవ్వొస్తోందా?

చం:— మరే.

శా:— ఎల్లాగైతేం నీకు సంతోషం కలగడంకంటె రెండోది నా కక్కర్లేదు.

చం:— అయితే మీాకు యావజ్జీవమూ మొక్కుతాను... ఎంచేతంటే, ఎంతేనా సౌఖ్యం అతనితో నాకు పెళ్లి!

శా:— అతనితో ఏమిటీ? (అనిలేస్తాడు)

చం:— అతనంటే ... ఆ అబ్బాయితో. (అని లేస్తుంది)

శా:— (తిప్పుగుంటూ) ఆ అబ్బాయితో! అల్లానేఉంది. ఇందాకణ్ణించీ నే మాట్లాడింది వాడితో నీకు పెళ్లని కానే కాదు! భర్తవిషయంలో నీకు తొందరకూడదు. నీకు మంచి వాణ్ణి ఒకణ్ణి నేను ఇదివరకే చూసేసిఉంచేశాను, సర్వసిద్ధంగా! ఇక, వాడున్నాడే ఆ అబ్బాయి! వాడి ప్రస్తుతివ్యాధితో వా డసలు టపాకట్టేస్తాడు. ఒకవేళ వా డల్లా చెయ్యకపోయినా, నీకు వాడి ప్రమేయం వద్దు, గుమ్మంలోకి వస్తే, ఫెడీమని తలుపు వేసెయ్! తలుపు తియ్యమంటే కిటికీలోంచి రాయి విసిరెయ్! తెలిసిందా? ఇక్కడ వాడు కాలెట్టకూడదు. నిన్ను వెయ్యికళ్లతో చూస్తూంటాను. జాగర్త.

చం:— అతడు చాలా అందంగా ఉంటాడండీ!

శా:— మరి వాగుడు వద్దు.

చం:— నాకు ధైర్యం ఎల్లా వస్తుందండీ ... అతణ్ణి...

శా.— పై వెళ్లిపో! సురేమీ విన నివ్వడు.

చం:— మీ రిదంతా నిజంగా...

శా:— చాలన్నాను. నేను యజమానిని. (చెయ్యిచాచి ఆజ్ఞ సూచిస్తూ) వెళ్ళు, చెబుతున్నాను, విను. (అని నెమ్మదిగా చెయ్యి దింపుతూండగా, చంద్రప్రభ కొంచెం కోపంగా ఎడమ మధ్యకి మెల్లిగా వెళ్లిపోతుంది. శానయ్య, నెగ్గినవాడికిమల్లే అభినయించి, కుడిఎదరకేసి తిరిగి, నరే వాడి పని పడతా వన్నట్టు తర్జనితో బెదిరించుతూ కుడిఎదరకి పోతాడు)

## 3వ రంగం

చంద్రప్రభని పెట్టిన మేడ.

(కుడిఎదర్నించి శానయ్య వచ్చి, ఎడమఎదరకేసి నడిచి, రమ్మని సంజ్ఞ చెయ్యగా, ఎడమఎదర్నించి మాలోకం వస్తాడు. వాణ్ణి రహస్యంగా కుడిఎదర దగ్గరికి తీసికెళ్లి)

శా:— వాడు మళ్లీవచ్చాడురా?

మా:— (నవ్వుతూ) వచ్చాడండి.

శా:—నవ్వుతా వేం? చికకొట్టేను గనక!

మా:— ఆయన రావడంతోటే ప్రభగారు తలుపు ఛెడేమని వేసేశారండీ! (అని ఇంకా నవ్వుతాడు)

శా:—బలే. వాడు తలుపు తియ్యండం కే లేదేమా!

మా:—నూన్నాడండీ, కేకేశాను. ఆమట్టున ఆవిడ కిటికీ దగ్గరికొచ్చి, ఇంత రాయుచ్చుగుని, ఆయనిన్ని చావగొట్టింది.

శా:- భేష్ మొహం బద్దలై ఉంటుంది వెధవకి. సిగ్గుంటే ఈపాటి వాడు చచ్చిపోయుండాలి.

మా.—అబ్బే, వాడికి సిగ్గులేదండీ. నాకు మారని డబ్బిచ్చాడు, చచ్చినాడూ!

శా.—ఇదోటా? సర్లే, నువ్వు పుచ్చుకున్నావా?

మా:—ఏం చేసుకుంటానూ, మారనివీ!

శా:—మారేవైతే?

మా:—మారేవైతే పుచ్చేసుకుంటాను.

శా:—(వాణ్ణి కొట్టబోయి) అట్రా నీతో చెప్పిందీ?

మా:— బాబో బాబో. అదికాదండీ. పుచ్చుగునీ... పుచ్చుగునీ... వాణ్ణి తరిమేస్తాను.

శా.—(తగ్గి) అదా, అల్లా చెయి. తెలిసిందా?

మా:—చిత్తం.

శా:—సరే. నువ్వెళ్ళి, పురోహితుణ్ణి నేరమ్మన్నానని కేకేసి, ఇంటిదగ్గిరుండు.

మా:—చిత్తం. (అని కుడివైపుకి వెళ్ళిపోతాడు)

శా:—(ఎడమ మధ్యకి నడిచి "ఏయ్ చంద్రప్రభా" అని కేకేసి చప్పట్లు కొడతాడు.)

చం:—(ఎడమ మధ్యనించి చిన్నకుర్చీ తెచ్చి అతడికి వేసి

ఒకటి తెచ్చి తను వేసుగుని కూచుంటుంది. కట్టుపని చేతులో పట్టుగుని ఉంటుంది.)

శా:—ప్రభా! విన్నాను. వాణ్ణి నువ్వు బెడ్డ వుచ్చుగుని కొట్టావే, అందుకు చాలా ఆనందించాను. అదే పద్ధతి. సరి. ఇటుచూడు నాకేసి. జాగ్రత్తగావిను. ఆపని దూరంగా పెట్టు.

చం:— కట్టుపని ఎకము మధ్యకి పారేస్తుంది.)

శా:— నేను స్వయంగా నిన్ను పెళ్లాడబోతున్నాను! నీ అల్పస్థితికి నాఅంతవాడు దొరకడం నీపుణ్యం. అనేక స్త్రీలని తిరస్కరించిన ఘటాన్ని నేను. అల్లాంటివాడనైన నేను అధో లోకంలోంచి నిన్ను కనికరంతో ఉద్ధరించాను. ప్రభా! తెలిసిందా?

చం:— అధోలోకం ఏమిటీ! ఆఊర్నించి ఈ ఊరొచ్చానూ! అంతేగా!

శా:— అంతేకాదు, ప్రభా, శ్రద్ధగా విను. పెళ్లంటే మజాకా కాదు, పెద్ద బాధ్యత, గొప్పభారం.

చం:— సంతోషదాయకం కాదూ?

శా:— ఆనంగతి చెప్పలేం. పెళ్లి అంటే ఇద్దరి ఏకత్వం. ఆయిద్దరూ సమం కారు. ఒకరు చెప్పాలి, రెండోవారు వినాలి. ఒకరు ఆజ్ఞాపించాలి, రెండోవారు అనువర్తించాలి. ఒకరు పాలించాలి, రెండోవారు పాలింపబడాలి. ఎంతో మచ్చిగా, ఆనుకూల్యం, వినయం, గౌరవం, భక్తి చూపించి, భార్య తన మొగణ్ణి నాయకుడుగా, ప్రభువుగా, యజమానిగా, దైవముగా

ఆరాధించాలి.

చం:— అని ఎవరు చెప్పారూ!

శా:— నాలాంటి పెద్దలు! భర్త తీవ్రంగా చూస్తే (అభినయించి) ఇల్లాగ భార్య (అభినయించి) సిగ్గుపడాలి. ఈకాలంలో చాలమంది భార్యలు తగ్గ సిగ్గు చూపించటం లేదు. నువ్వు లేకణ్ణించి అల్లా కాకూడదు. పెళ్లి అయిన తక్షణం నువ్వు నాలో సగం అవుతావు గనక నాగౌరవం కాపాడాలి. తుంటరి స్త్రీలని దేవుడు అమాంతంగా ఉడుకునీళ్ల డేగిసాల్లో ముంచేస్తాడు.

చం:— (భయపడి మూతిమీద చెయ్యి పెట్టుగుని) అయ్యో, పాపం! అయితే, దేవుడూ, తుంటరి పురుషుల్ని ఏం చేస్తాడండీ?

శా:— వాళ్లనీ దేవుడు ఏదోఓటి చేసేస్తాడు. అదంతా వేరే విషయం పైగా నీ విషయం కానేకాదు. ఇదిమాత్రం అక్షరాలా నిజం. ఇల్లాంటి సంగతులు నువ్వు కంఠతా పట్టాలి. ఇవి మననం చేసుగుని జాగ్రత్తగా ఉంటావా నీకీర్తి తెల్లగా ప్రకాశిస్తుంది. లేక తుంటరివి అవుతావా, నీకీర్తి మాడిపోయి బొగ్గులా అవుతుంది. ఉండు...నాదగ్గిర ఓ కాయితం ఉండాలి ...(అని జేబూ వెతికి ఓకాయితం తీసి) ఇదుగో, ఇందులో ఒక పుణ్యాత్ముడు భార్యయొక్క విధులు రాశాడు. పుచ్చుగో. ఈకాగితం నీదగ్గర రక్షరేకలా ఉంచుగో. అన్నట్టు మఠంలో నీకు రాయడం నేర్పద్దనీ, చదవడం మాత్రం నేర్పమనీ అన్నానే!

చదవగలవు కాదూ!

చం:— (తల ఊపుతుంది)

శా:— చదువ్. ఓమాటు. నీనోటంట, నా చెవులారా ఆరగిస్తాను!

చం:— (కాగితం చూసి చదువుతుంది) "భార్యయొక్క విధులు"—"౧. ఒకడు ఒకతెను పెళ్లాడడం కేవలం తన ఒకడి నిమిత్తమే అనే ప్రధానవిషయం భార్య మరవరాదు."

శా.— సంపూర్ణ వ్యాఖ్యానాలు తరవాత చెబుతా లే. ఇప్పుడు అవి చదివెయ్. తరవాత కూచుని అధమం ప్రతీవాక్యంలోనూ ఉండే ఆయువుపట్లు కంఠతా పట్టిపారెయ్

చం:—(చదువుతుంది) "౨. భార్య వేషం బాగుండడంసంగతి భర్తదే గనక, వాడు వేసుగోమన్న వేషం ఆమె వేసుగోవలసిందేగాని, ఊళ్లో వాళ్ళు ఆ వేషం నవీనంగా లేదంటారేమో అని ముందే ఉరెట్టుగోకూడదు."

శా:— (అది వింటూ అభినయిస్తూ ఉంటాడు)

చం:— (చదువుతుంది) "౩. ఓరచూపులూ, నేత్రసంజ్ఞలూ, పౌడర్లూ, రంగులూ, వింతకాటుకలూ మొదలైనవాటిని గురించి భార్య నేర్చి పేర్చి కూర్చడం కేవలం భర్తకోసం కాదేమో అనే అర్థం రావచ్చుగనక భార్య వాటిని విసర్జించాలి."

శా:— ఈ వాక్యంలో 'కేవల భర్తకోసం కాదేమో' అనేది ఆయువుపట్టు. కానీ.

చం:—(చదువుతుంది) "౪. దృష్టిబాణాలతో ఇతరుల్ని

గాయపరచ వలసిన అవసరం రానియ్యకుండా, భర్తవరోక్షంలో, భార్య తన కళ్లు మూసేసుకుంటే మంచిది."

శా:—(చేతిరుమాల్తో అభినయిస్తూ) ఇల్లాకట్టేసుకున్నా సరే.

చం:—(చదువుతుంది) "౫. భర్త లేనప్పుడుమాత్రమే ఇంటి కొచ్చి, భార్యగారిదర్శనమాత్రమే కోరేవాళ్లు భర్తకి ప్రతికూలురు గనక, వాళ్లకి,అప్పట్లో భార్య స్వాగతం ఇయ్యరాదు."

శా:—లేకపోతే వాడు తనకి వ్యాధి అంటూ మొదలెడ తాడు మరి.

చం:—(చదువుతుంది) "౬. ఈకాలంలో ఏదీఊరికే జరగదు గనక, ఇతరులదగ్గిర్నించి భార్య బహుమతులు పుచ్చుకో కూడదు."

శా:—బహుమతీ అంటే ఒకరకం బజానాగనక.

చం:—(చదువుతుంది) "౭. ఇంట్లో రాతపని యేవత్తూ భర్తే చూడడం కర్తవ్యంగనక, సిరా కాగితమూ కలమూ మొదలైనవి భార్యస్వాధీనంలో ఉండరాదు."

శా:—పెనసలూ చాకూకుడా ఉండకూడదు.

చం:—(చదువుతుంది) "౮. నాగరికసభ లనబడే తుంటరికలయికలలోనే అమాయికభర్తలమీద చాటుకుట్రలు పన్నడం జరుగుతుంది గనక, భార్య సభలకి వెళ్లరాదు."

శా:—ప్రతినిధుల్నికూడా పంపించకూడదు.

చం:—(చదువుతుంది) "నా. భార్యకి జాదంపనికిరాను."

శా:—ఇక చాల్లే. ఆనక అవన్నీ చివరిదాకా చదువుకో. వాటిల్లో విశేషార్థాలూ సూత్రాలూ నీకు తరవాత బోధ పరుస్తాను. నా కిప్పుడు ఓపని ఉన్నసంగతి జ్ఞాపకంవచ్చింది. ఇప్పుడే వస్తాను. లోపలి కెళ్లు.

(చంద్రప్రభ ఎడమపక్కకి వెళ్లిపోతుంది. రెండవ తెర పడుతుంది.)

శా:—(రెండవ తెర పడతూండగా కుడిమూలకి నిష్క్రమించి, అప్పుడే కుడిఎదరనించి నడ్డిని చేతులు పెట్టుకునివచ్చి) ఈ శ్లోకలన్నీ రాసింది మనసమే. అమాయకురాలు గనక చదవమంటే చదివింది. మరో మరో మాయలాడి అయితే ఈకాయితం నా మొహం మీద దాఖలుచేసేది. ఈపిల్లని పెళ్లాడ్డమే పెళ్లాడ్డం. మైనంలాంటిది, నా యిష్టంవచ్చిన రూపంలోకి యీగారు చేసుకుంటాను. నేను ఊళ్లో లేకపోడంవల్ల కొంచెం ప్రమాదంలో పడిపోయింది. మరి ప్రమాదాలు రానియ్యను. తెలియని ఘుటంగనక నిమిషంలో చెప్పగలిగాను. తెలిసిన జంతువైతే చెప్పనియ్యదు సరిగదా నన్ను ఓంభాయాట్టేస్తుంది... ఇక, మన యువకుడు! వీడింకా ఏం జేస్తున్నాడో గ్రహిస్తాను. మనవాళ్ల దగ్గిర రహస్యాలు దాగుతాయీ! వాడే చెబుతాడు... (ఎడమఎదరకేసి చూసి)...ఇదుగో, ఇల్లావస్తున్నాడు నా కోసమే గావును!

నీ:—(ఎడమఎదరనించి వచ్చి) మీకోసమే వెళ్లివచ్చాను. నమస్కారం.

శా:-- నమస్కారం! ఈ లాంఛనాలు ఎందుకయ్యా పరిచయస్థులకి! ఏమైంది నీ యత్నం? అప్పుడు నే నేదో ఆలోచనలో ఉన్నాను. జయమేనా?

నీ:-- ఏం జయమండీ, వ్యాపారం పాడైంది.

శా:-- అయ్యో, పాపం.

నీ:-- నా ప్రియురాలి యజమానిట ఊర్నించి వచ్చాడు.

శా:-- ఎంత కష్టం వచ్చిందీ!

నీ:-- పైగా ప్రారబ్ధం, వాడి కిదంతా తెలిసిపోయింది.

శా:-- ఇంత త్వరగా ఎల్లా తెలిసిందయ్యా?

నీ:-- ఏమో! వేళప్రకారం ఇందాకా వెళ్లేసరికి ఎవరో నా మొహం బద్దలయ్యేట్టు ఫెడీమని తలుపేశారు.

శా:-- నీ మొహం బద్దలయ్యేట్టు!

నీ:-- అవునండీ, నా మొహామే...

శా:-- తలుపు ఫెడీమని వెయ్యడం చాలా మోటుగా ఉంది.

నీ:-- నేను మాట్లాడదాం అనుకుంటే 'యజమాని వచ్చారు, పో' అన్నారు.

శా:-- పాపం తలుపు తియ్యనేలేదూ?

నీ:-- లేదు. పైగా, ఆ అమ్మాయి కిటికీలోంచి, కోపంగా, నామీద ఓ రాయి గిరవటేసిందండీ!

శా:-- (ఆశ్చర్యంతో లాగ) ఏమిటీ? రాయా?

నీ:-- మరేనండీ, చిన్న రాయి కాదు, మంచి విలువైన రాయి. ఆవిడ నా కిచ్చిన స్వాగతం అది.

శా:— ఓరి వెర్రివాడా! నీ అవస్థ చూస్తే నాకు జాలేస్తోందే!

సీ:— ఆ యజమాని రావడం నాకు విసమించిందండీ!

శా:— నీకు లెఖ్ఖేమిటీ! ఏదో ఉపాయం చూదాం.

సీ:— వాడు ఘట్టి కాపలా పెట్టాడాండీ, దాన్ని మించి పోయే ఎత్తు వెయ్యాలండీ!

శా:— నీకు క్షణం. ఆ అమ్మాయి నిన్ను ప్రేమిస్తోందిగా!

సీ:— నిశ్చయంగా.

శా:— అందుకనే నీ రొట్టె నేతిలో పడుతుంది.

సీ:— అనుకుంటున్నాను.

శా:— పెద్దదెబ్బ లెఖ్ఖేమిటయ్యా, అదో ఛలోక్తి! అందులో ఆశ్చర్యం ఏముంది!

సీ:— నిజమేనండీ, ఆ యజమానే అల్లా చెయించి ఉంటాడు, అందులో ఆశ్చర్యమేమిటిగాని, నాకు ఆశ్చర్యం వేసిన విషయం మాత్రం మరోటి ఉంది.

శా:— (కుతూహలం లేనట్టు యాదాలాభంగా) ఆ ఆశ్చర్యమేమిటయ్యాయ్!

సీ:— ప్రేమ పెద్ద గురువుగావును, ప్రేమ క్షణాలో ప్రకృతి పరివర్తన తెస్తుందిగావును, ప్రేమ అద్భుతాలు జరుపుతుంది గావును, ప్రేమవల్ల లుబ్ధులు దాతలూ, భీరులు శూరులూ, అధములు ఉత్తములూ, ముగ్ధలు ప్రౌఢలూ అవుతారు గావును...

శా:— గావును గావును గావును...ఏమిటిప్పుడూ!

నీ:— ఆపిల్ల ఏంజేసిందా, కిటికీలోకి వచ్చి, నన్ను చూసి, "నువ్వు చెప్పేది నాకు తెలుసులే. ఇదుగో పుచ్చుకో నా సమాధానం" అనే మాటలు అంటూ ఒక రాయి గిరవాటేసిందండీ. అది నా కాళ్లదగ్గిర పడింది. ఆ రాతికి...ఓ ప్రేమ జాబూ...కట్టేసిఉంది.

శా:— (కళ్లు తేలేసి) ఆఁ ఆఁ ఆఁ.

నీ:— పరమాశ్చర్యం కాదండీ! ప్రేమ హృదయాన్ని మార్చదండీ! బుద్ధిని నిశితం చెయ్యదండీ! చెప్పండి ఏమంటారు! మీరు ఈ రాతిజాబు వ్యవహారం మెచ్చుకోరూ? ఆ యజమాని హాస్యప్రియుడు కాలేదూ! (అని నవ్వుతాడు)

శా:— (బలవంతంగా నవ్వుతూ) ఆ. చాలా హాస్యప్రియుడిలాగు.

నీ:— అబ్బ, ఇంతకంటె ఏముంటుంది బాఘా నవ్వండీ! ఆ అతిజాగ్రత యజమాని తన పద్ధతులవల్లే తను అమాయికపు ట్రెయినింగిచ్చిన పిల్లచేతే దగాపడుతున్నాడు. ఇది ఒకటోరకమైన సారస్యం కాదండీ! తల్చుకుంటేనే నాకు నవ్వొస్తోంది. మీరు బాగా నవ్వాలేమండీ!

శా:— క్షమించాలి. నేనూ తెగనవ్వుతున్నాను. ఇదుగో. (అని పళ్లన్నీ కనపడిచి ఆగి) చాలా! (అని హాస్ హాస్ అని నవ్వి ఆగి) సరా! (అని తలటెక్కించి హీహీ అని ఆగుతాడు).

నీ:— సరే. నా ఆంతర్యం మీ కెరుగుదురు కాబట్టి ఆ

అమాయికపు ప్రేమలేఖ మీకు వినిపిస్తానుండండి. (అని లేఖ పైకి తీస్తాడు)

శా:—(తనలో) రాయడం నేర్పద్దంటే మతంవాళ్లు విన్నారు కారు. వెళ్లి వాళ్లని చంపాలి.

నీ:—(ఉత్తరం చదువుతాడు) "రాయడంనాకు ఎవరూ నేర్పలేదు నేనే నేర్చుకున్నాను. నాకు ఏమీ తెలియదు. ఇది రాయడం తప్పో ఒప్పో ఎరగను. నా హృదయాన్ని విప్పిచెప్పే మాటలు నాకు లేవు. నిన్ను ద్వేషించాలిట! అది నేను చేయలేను. నీలోనే నా జీవితం నాకు కనపడింది. యువకులు మోసగిస్తారట. కాని నువ్వు మోసగాడవు కావు. నీ మాటలు నిజము, నువ్వు నిజము. నీ మాట నిజము కాకపోతే దుఃఖం మితిమీరి నేను మరణిస్తాను"

శా:—ఆః టక్కరి భడవా! (అని దగ్గుతాడు)

నీ:—ఏమిటంటున్నారు?

శా:—నేనా, అబ్బే, ఏం లేదూ. ఊరికే దగ్గొస్తే దగ్గుతున్నాను.

నీ:—మాశాగా! ఇంత నిష్కల్మషమైన హృదయ ప్రకటన ఎక్కడేనా చూడగలంటండీ అసలూ! ఇటువంటి పవిత్రాత్మని అజ్ఞానాంధకారంలో పడేసి ఉంచడం తలవంపు కాదండీ! కాని, ప్రేమ ఉదయించి ఆ అంధకారాన్ని పటాపంచలు చెయ్యడం మొదలెట్టింది లెండి. ఏ దేవుడుదయవల్లో నేను నెగ్గి ఆ యజమాని పశువు, ఆ మోటజంతువు, ఆ పరమతుంటరి, ఆ రాతి

రాడీ, ఆ పూర్ణమూర్ఖుడు, ఆ నరవ్యాఘ్రం...

శా:— సెలవు సెలవు! వస్తాను.

సీ:— అంత అరాత్తుగా పోతున్నారే!

శా:— ఒక అర్జెంటు పని జ్ఞాపకం వచ్చింది, వెళ్లాలి.

సీ:— కొంచెం ఉండండీ అబ్బా, నాకు సలహా చెప్పండి. ఆ యింటికి వెళ్లడం ఎల్లా? మొదట ఒక ముసిలిదాన్ని పంపించాను. అది నాలుగు రోజులకిందట చచ్చిపోయింది.

శా:— అబ్బ! ఏదో ఉపాయం దాన్నే ఆడుక్కుంటూరా! (అనేసి తొందరగా కుడిఎడరనించి వెళ్లిపోతాడు)

సీ:— సెలవ్. ఏమీ తోచకపోతే, మీరున్నారుగా, మళ్లీ మీ దగ్గిరకే వస్తాను. (అని ఎడమఎడరకి నిష్క్రమిస్తాడు)

## 4వ రంగం

శానయ్య ఇల్లు.

శా:— (కుడిఎడర్నించి వచ్చి కుర్చీమీద కూచుని, కొంచెం ఆలోచించి, కుడిఎడరకేసే తిరిగి) ఏంరా! మార్కం!

మా:— చిత్తం. (అంటూ కుడిఎడర్నించి వస్తాడు)

శా:— మరి అక్కడికి త్వరగా వెళ్లు. నేనింతకిముందే వెళ్లొచ్చాను.

మా:— ఇదిగో వెడతానండి.

శా:— అక్కడ జాగ్రత్తరోయ్.

మా:— మీకు చాతర్యంగాని, మళ్లీ చెప్పాలాండి!

శా:— మెత్తపడి వాడికిగాని ప్రవేశం ఇప్పించావా...

మా:— ఛఛా. అల్లాంటివని ఎప్పుడూ చెయ్యనండి.

శా:— నా గౌరవం పోతుందిస్మీ.

మా:— నాకు మాత్రం అగౌరవం కాదండీ! అల్లాంటి పన్లే బుర్రపోవాలిగాని!

శా:— తప్పుడు పని చేసి వాడికి సాయం చేశావా, నిన్ను జనం చంపేస్తారు. చంపేసీ, ఇదుగో ఆ వెధవా అంటారు.

మా:— అంత బుద్ధిలేనివాణ్ణి కాను, బాబూ.

శా:— అయితే, వాడే ఒక వేళ వస్తే, నువ్వేం చెయ్యాలో ఆ పాఠం జ్ఞాపకం ఉందా?

మా:— ఓ. పిక్కలాగ జ్ఞాపకం ఉంది.

శా:— ఏదీ ఓసారి అభినయించు చూద్దాం.

మా:— మీరే ఆ అబ్బాయి అనుకుని రండి మరి!

శా:— (లేచి కొంత సర్దుకుని దీనత్వం నటిస్తూ) మాలోకం! మాలోకమోయ్! మాలోకమూ! నాకు సాయం చేసి నా విచారం తగ్గించవోయ్, నన్ను లోపలికి రానీవోయ్!

మా:— (నటిస్తూ—అసహ్యతతో) పోపో చవటా! (అని చెదరకుండా ఠీవిగా నుంచుంటాడు.)

శా:— (నటిస్తూ) నువ్వు ఎంతో మంచివాడవురా అబ్బా!

మా:— (నటిస్తూ, చెయి విసిరి) పోవోయ్ గాడిదా!

శా:— (నటిస్తూ) నాకూ మానమర్యాద లున్నాయి, ఇందులో నీకేమీ చిక్కు రాదోయ్!

మా:—(నటిస్తూ, మనిషిమీదకెళ్లి) నీకాకాదూ చెబుతూంటా! చెప్పుచ్చుగు తన్నేను, పో!

శా:—(నవ్వుతూ) బాగుంది, బాగుందిరోయ్. (నటిస్తూ) నీకు కనికరం లేకపోతే నా ప్రాణం దక్కదురా మాలోకం!

మా:— అందుకనే ముందు మీ యింటికెళ్లి మరీ చచ్చిపో!

శా:—(మెచ్చుతూ) భేష్! (నటిస్తూ) నేను నీ శ్రమ అట్టే పెట్టుగోను. ముందే పుచ్చుగో పోని! ఇదిగో. (అని డబ్బు ఇస్తాడు) తరవాత చాలా ఇస్తాను.

మా:—(నటిస్తూ — డబ్బు పుచ్చుగుని మనిషిని తోస్తూ) పోతావా పోవురా?

శా:—(నటిస్తూ — కదలడు.)

మా:—(నటిస్తూ — లోపలి కర్ర తెచ్చి) వెళ్లమంటే ఏమిట్రా నీ పైత్యం!

శా:— ఆఁఆఁ ఆగు. చాలు.

మా:— అయ్యగారూ! నేను బాగా అభినయించలేనండీ! నిజంచెప్పండి.

శా:— చాలా భాగా ఉంది గాని, మరి డబ్బు పుచ్చుగో కూడదు. పుచ్చుగున్నావే!

మా:— ఒస్ అదాండీ! అక్కడ ఒక్క నోటామాత్రం మీరు చెప్పిన పాఠం మరిచిపోతూనండి. అల్లాయితే పోనీ మళ్లీ చేద్దాం రండి.

శా:— వద్దులే నువ్వెళ్లిపో త్వరగా.

మూ:-- చిత్తం. (అని ఎడమవైపుకి పోతాడు)

శా:-- (కొంచెం నడుస్తూ) రిబ్బన్లూ పౌడర్లూ సెంటూ కుమాళ్లూ చీర్లూ సవరాలూ లాంటివి అమ్మేవాళ్లు ఆ వీధికి వెళితే వాళ్లు ఒకవేళ వేషధార్లేమో కనిపెట్టడానికి జనాన్ని పెట్టాను. చూద్దాం సంగతి! (ఎడమ ఎవరకేసి చూసి) ఓహోహో! ఇదిగో వీను మళ్ళీ తయారూ!

నీ:-- (ఎడమ ఎవర్నించి వచ్చి) అయ్యా! నమస్కారం. (అని కంగారు పడతాడు.)

శా:-- చిత్తం. రండి. ఏమిట్లా కంగారుగా ఉన్నారు? ఏమైంది?

నీ:-- ఏం చెప్పను! చావు తప్పి కన్ను లొట్టోయింది. ఇవతల పడ్డాను.

శా:-- ఎక్కణ్ణించి?

నీ:-- ఆ అమ్మాయి గదిలోంచి. (అని స్థాయిగా కూచుని చెమట తుడుచుకుంటాడు)

శా:-- ఎల్లా?... (తనలో) అయ్యో! గదిలోంచా! ఇహ బతకనే ప్రభా.

నీ:-- మేడమీంచి నాకు సంజ్ఞ చేసింది. దిగి తోటతలుపు తీసింది.

శా:-- (ఆశ్చర్యంగా) అక్కడ జనం లేరు మరి?

నీ:-- కంటపడేవాళ్ళు లేరు మరి. అక్కణ్ణించి నన్ను తన గదిలోకి తీసికెళ్లింది. ఇంతలో పెద్ద దెయ్యంలాగ ఆ యజమాని

అవిణ్ణే చూడొచ్చాడుట !

శా:-- ఆఁ.

నీ:-- చటుక్కున నన్ను డ్రెస్సులు పెట్టేచోట ఆ అమ్మాయి దాచేసింది.

శా:--(మెచ్చుకుంటూన్నట్టు నటిస్తూ) అరి దీని తెలివి తగలెయ్యా !

నీ:-- ఆ యజమాని ఎందుకో ఇటూ అటూ పరుగులూ, బారెడేసి నిట్టూర్పులూ, జుల్లు పడదొయ్యడమూ, కుక్కల్ని తన్నడమూ మొదలెట్టాడు. వాడూ పసికట్టి ఉంటాడు. చివరకి పోయాడు. నేనూ ఏర్పాటు చేసేసి వచ్చేశాను.

శా:-- ఏమి ఏర్పాటయ్యోవ్ !

నీ:-- నే నాపిల్లని అక్కణ్ణించి తీసుకుపోతానండీ. మీరుతప్ప ఇక్కడ నాకు ముఖ్యులు లేరు, కనండి. రాత్రి పన్నెండింటికి వెళ్ళి సంజ్ఞగా మూడు సార్లు సకిలిస్తాను.

శా:-- నువ్వే !

నీ:-- మరే. ప్రభ కిటికీ తీసి నిచ్చెన వేస్తుంది. నేను ఎక్కి లోపలికి వెడతాను. వెంటనే దిగివచ్చి (చిటికె వేసి, పోతాం అన్నట్టు కళ్లమాత్రతో సూచిస్తాడు) ఇదీ ఎత్తు. నావిజయం మీవిజయంలానే భావించేవారు గనక, ఏం జరిగిందీ మళ్ళీ వచ్చి మీతో చెబుతాను. ప్రస్తుతం సెలవ్. వెళ్ళి ఏర్పాట్లు చూసుకోవాలి. (అని లేచి, ఎడమ ఎదరకి పోతాడు)

శా:-- ఘోర! నాచేత అపనిందలు పడకుండా ఇంత

వరకు ఏభర్తా దాటలేదు. ఆ అవస్థే పెళ్ళికి పూర్వమే నాకు పట్టింది. కాని, నా అవస్థలో ఓ విశేషం ఉంది. ఏమిటంటే: ఈ వదుచుకుంక తన గర్భ శత్రువునైన నేనే తనకి అంతరంగికమిత్రుణ్ణి అనుకుంటున్నాడు. తన కార్యవిధానం యావత్తూ నాతో స్వయంగా చెబుతున్నాడు. నేనూ తయారై చూస్తాను. నీవు దాని మనస్సు లాగేశావు. నేను దాని శరీరం ఆపేస్తాను.

(ఎడమవైపునించి నరయ్య వస్తాడు)

న:— (లోపల్నించి) ఏమండోయ్, శ్రీ అరుణాచలంగారు!

శా:— (అటు చూసి) ఆం. రా, కూర్చో!

న:— కసిపెట్టుగున్నావుగా వును, భోజనానికి లేద్దామా?

శా:— నే నీపూట ఉపోష్యం.

న:— నన్ను భోజనానికి రమ్మన్నావ్, ఏమిటీ వికారం?

శా:— క్షమించు, నేను కొంత ఆలోచన చేసుగోవాలి.

న:— పోనీ, నీపెళ్లి రేపేగా?

శా:— నా పెళ్లిగురించి నీకు బాధ ఎందుకు పోదూ!

న:— ఊళ్లోవాళ్ల తప్పొదువన్లన్నీ నవ్వు గ్రంథం చెయ్యలేదూ! అల్లానే.

శా:— నరేలేస్తూ, నా దారి వేరు.

న:— అల్లానా! పోనీ, పిల్లని చూపించు, చూపిస్తానన్నావ్.

శా:— అన్నాను అనడం. అంటేమాత్రం? ఇప్పుడు అభిప్రాయం మారింది.

న:— నన్ను కూడా నమ్మవా!

శా:— నమ్మకేంగాని, జాగర్త ఎందుకైనా మంచిది.

న:— నీ ధోరణి ఇల్లా మారిందే!

శా:— వ్యక్తుల్నిబట్టి మారుతూంటుంది.

న:— నేను పూర్వవ్యక్తినేగా!

శా:— వ్యక్తి పూర్వవ్యక్తి అయినా, కాలం మారదు మరీ!

న:— అంటే సంబంధం తెగిపోయిందా?

శా:— భర్తే తెగిపోదు. నా చేతిలోది ఎక్కడికి పోతుందీ?

న:— ఏమో, ఎవరు చెప్పగలరూ!... పోన్లే ఏమైతే నాకెందుకులే, నువ్వు ఆనాటి భర్తృవ్యామోహం కాకు.

శా:— కాను. నేను ఎంత చెడ్డా ఆనాటి భర్తకంటె పైచెయ్యిగానే ఉంటాను.

న:— ఉండవు ఒకేవిషయం ఎప్పుడూ ఆలోచించేవాడు ఆవిషయంకంటె నీచుడే!

శా:— కాదు, సత్యవాది.

న:— అల్లానా! అయితే ఆ సత్యవాదికి క్షమ ఉండద్దూ, పోనీ!

శా:— సరిసరి. చంపేస్తున్నావే, ఎక్కడోగానీ! ఆనాటితనం పాపం. పాపాన్ని నేను ఏకుతాను.

న:— నాఅభిప్రాయం వేరు...నువ్వు ఆలోచించుకో పాపం. శెలవ్ తాను అరుణాచలం! (అని ఎకమ ఎదరకి పోతాడు)

శా:— (ఎకముఎదరికి చూస్తూ) ఎక్కడపోయి రమ్మన్నాను.

వీణ్ణే! ఇటువంటి విషయాలు తెలియని వాళ్లతో తప్ప వాదించ కూడదు!

మా:-- (ఎడమమధ్యనించి వచ్చి) అయ్యగారూ! పురోహితుడు వచ్చాడండీ!

శా:-- రేపు కనపడమను. చెప్పిరా.

మా:-- చిత్తం. (అని ఎడమమధ్యకి వెళ్లి అప్పుడే వస్తాడు)

శా:-- ఒరేయ్! ఇల్లారా! (అని రహస్యంగా) ఈవేళ రాత్రి వాడొచ్చి, నిచ్చెనమీదా, చంద్రప్రభని లేవదీసుకు పోతాట్ట! (అభినయిస్తూ) లాం వాటి కర్రతో, వాణ్ణి, పై చివర మెట్టుమీది కెక్కేసరికి, నువ్వూ, ఏశాలి!

మా:-- ఓ. వాణ్ణి చావగొట్టేస్తాను. చూద్దురుగాని, ఆ బడితెబాజా!

శా:-- బడితెబాజా ఎక్కడ చేస్తావ్?

మా:-- ఎక్కడేమిటండీ, వాడి బుర్రమీదే!

శా:-- వద్దువద్దు. బడితెబాజాకి వీపే మంచిరంగం. ఇంకా ఆలోచిద్దాం, రా. (అని ఇద్దరూ కుడిఎదరకి పోతారు.)

## 5వ రంగం

శానయ్యాఇల్లు : కుడిఎదర కేసి రెండు

కుర్చీ లుంటాయి.

శా:-- (తొందరగా ఎడమ ఎదరనించి వస్తూ తన వెనకాలే

వస్తూన్న మాలోకంకేసి తిరిగి) హారి! నా ప్రాణంమీదికి తెచ్చావురా, గాలుగాయి చచ్చినాడా! వాణ్ణి బుర్రమీద కొట్టకురా అంటే, వాడి బుర్ర బద్దలుకొట్టి వాణ్ణి చంపేశావుగదా!

మా:--(భయంతో) నే నేం జేశానండి, మీరు చెప్పినట్టే కొట్టానూ!

శా:--నీ శార్ధం! వాడి బుర్ర పచ్చడిచేశావు, వాడు మాటలేకుండా గతించి ఊరుకున్నాడు. ఇప్పుడు నా కేంగతి జారి! నన్ను పట్టుకుంటారు. (పళ్ళు బిగించి) బుర్రమీద కాదురా కొట్టమనా (వాడి వీపుమీద కొడుతూ) వీపు మీదరా (మళ్ళీ కొడుతూ) వీపుమీద రా అని (మళ్లీకొడుతూ) ఎన్నిసార్లు (మళ్లీకొడుతూ) హెన్నిసార్లు చెప్పానూ! (ఆగి) బుర్రశూన్యం వీనుగ!

మా:--(కొంచెం ఏడుస్తూ) నేను వాడి వీపుమీదేనండి కొడతా, వాడు బుర్రకాశాడు గావునూ!

శా:--మరి నోరు ముయ్! తెల్లారొస్తోంది. నువ్వు ఆ మేడదగ్గిరే ఉండు. నాపని ఆఖరే ఇహాను. వెళ్ళు. ఆ కర్ర ఇక్కడ తగలేసి మరీ వెళ్ళు.

మా:--(కర్ర కుడిఎడమ పడేసి వచ్చి, ఎడమ ఎదరకి పోతాడు)

శా:--(స్వగతః) ఔరా! కసి ఎల్లా పరిణమించిందీ! వాళ్ల వాన్నకూడా వస్తాడుగావును. అకస్మాత్తుగా ఈ వార్త వింటే

అత దేమవుతాడో! నా కేం రాసింవో!

(పడినప్పుడు ఒకటి రెండుచోట్ల ఒళ్ళు కొట్టుకుపోగా కట్టిన కట్లతో మెల్లిగా ఎడమమూలనించి నీహారం వస్తూ౦ది)

నీ:-- (వస్తూ) ఏకాండోయ్!

శా:-- ఎవరదీ! (అని లేస్తాడు)

నీ:-- నేను నీహారాన్ని. మీతో౦మే. మీ రింత పెందరాళే లేచారే!

శా:-- (తనలో) ఇదేమిటి దైవమా! ఏ డెల్లాబతికాడో! కలా, యక్షిణేఆ! (పైకి) రా. కూచో, కూచో.

నీ:-- కొంచెం బాధగా ఉందండీ. నాయత్నం అంతా ఐర్వ భగ్నం అయిపోయి...

శా:-- అల్లానా పాపం!

నీ:--...నట్టు కనిపించి, చివరకి ఛట్టున సగ్గిందండీ!

శా:--(నవ్వు మొహం పోయి) హోర నీఅదృష్టం కాలా! అల్లా ఎల్లా జరిగిందీ?

నీ:-- నామొత్తు నాశత్రువుకి ఎల్లానో తెలిసింది గావును, నన్ను కొట్టడానికి జనాన్ని పెట్టాడు. నిచ్చెన ఉంది. నేను పైకంటా ఎక్కేసరికి అమాంతంగా కర్రలు లేచాయి. నాకు ఠారెత్తి కాల్జారి కిందడ్డాను. ఒళ్ళుకొంచెం కొట్టుగుపోతేంగా నండి, నిచ్చెనకి తగిలాయి గాని నాకు ఒక్కకర్రదెబ్బ తగల్లేదు. నేను కిందడి మరి లేపలేదు.

శా:-- చిత్రంగా ఉందే!

నీ:-- కర్రదెబ్బలన్నీ నేను గతించానని వాళ్ళు గుసగుసలు మొదలెట్టారు. ఆ చీకట్లోనే వచ్చి నన్ను చూశారు. నేను శవంపాత్ర అభినయించాను.

శా:-- సరి, అంతేగాని నువ్వు చచ్చిపోలేదూ?

నీ:-- అనుకున్నానుగాని, మానేశాను.

శా:-- ఏం?

నీ:-- సీమూలాన్నే అంటే సీమూలాన్నే అనుకుంటూ అంతా పోయారు. కాపలావాళ్ళు అంతకిముందే జారిపోయారు. నేను చచ్చేయ్యనా, లేక లేచి వచ్చేయ్యనా అనుకుంటూంటే ఓ చిత్రం జరిగింది.

శా:-- ఏమిటా చిత్రం?

నీ:-- కొట్టడాని కొచ్చినవాళ్ళ గుసగుసలు విని, నే పోయా ననుకుని, నే పడ్డచోటికి చంద్రప్రభ వచ్చింది. నే పోలేదని గ్రహించి ఆనందించింది. ఇకమరి అక్కడ ఉండకపోడం నిశ్చయించుగుని నాతో వచ్చేసింది. తీసుకొచ్చాను.

శా:-- (చిరునవ్వుతో) చాలా బాగా చేశావ్. ఇప్పు డెక్కడుంది, పాపం!

నీ:-- (ఎడమ మూల చూపించి) ఇక్కడే అవతల నుంచో మని నేను లోపలికి వచ్చాను. మీవల్ల ఓసాయం కావాలి,

శా:-- ఏం సాయం?

నీ:-- ఆ అమ్మాయి లేచిరావడం అల్లరి సద్దణిగేదాకా ఆవిణ్ణి మీయింట్లో ఉంచాలి క్షేమంగా.

శా:— నిన్ను గురించి నేనుకూడా అల్లరిపడనా! పోనీ, అల్లానే. తీసుగురా, నీకు ఉపకారం అవుతూంటే వద్దనడం ఎందుకూ!

నీ:— అమ్మయ్య! తీసుగురానాండి!

శా:— తత్క్షణం. నేను మాట అన్నానంటే, మరి తిరిగిపోడం అనమాయితు లేదు.

నీ:— చిత్తం. (అని ఎడమమూలకి పరిగెడతాడు)

శా:— ఔర! అదృష్టానికి కళాకళలు. అదృష్టం ఈమాత్రం మేనా కలిసొస్తూంటే చెప్పద్దు.

(అని మొహమూ చేతులూ కప్పుగుని మధ్య ఎదరకుడికి తిరిగి నుంచుంటాడు. ఎడమఎదరనించి ప్రభ వచ్చి, ఎడమకి తిరుగుతుంది. వెనకాల నీహారంవస్తాడు. అక్కడే ఆగి ప్రభ నీహారంతో మాట్లాడుతుంది)

చం:— నువ్వు వెళ్లిపోతావా?

నీ:— ప్రభా! ఇప్పుడు నువ్వు నాతో ఉంటే మనకి చిక్కు. ఆయనతో వెళ్ళు.

శా:— (జరిగి, ఎడమకి తిరిగిఉన్న ప్రభయొక్క కుడిచెయ్యి పట్టుగుంటాడు)

చం:— (కుడికి తిరక్కుండానే) త్వరగా రామరీ!

నీ:— రాకుండా ఉండగలనా!

శా:— (ప్రభ చెయ్యి లాగుతాడు)

చం:— (అటు తిరక్కుండానే) ఉండు. అల్లా లాగేస్తావేం? (నీహారంతో) నేను వెళ్లడం ఎవరో ఎరగని మనిషితోనా?

సీ:— భయం లేదు. ఆయన నా తండ్రిలాంటివాడు. నే పోతాను. వెళ్లండి. (అని ఎడమువైపుకి పోతాడు)

శా:— (ప్రభని కుడివేపుకి రెండంగలు నడిపించి, ఆగి) క్షేమంగా ఉండేచోటికి రా! (ముసుగుతీసేసి) నన్నెరుగుదువా?

చం:— అయ్యో! నువ్వా! (అని ఎడమవైపు కేసి చూస్తుంది)

శా:— ఓసి స్వామిద్రోహురాలా! మొహం చెల్లకనా అటు చూస్తున్నావ్!... ఎంత అమాయికత్వం నటించావ్!... "ఆఅమ్మాయిని ఎక్కడేనా దాయించారో లేకపోతే చక్కించారో కనుక్కోండి" అని అడక్కడమూనూ (చెయ్యి ఇటూ అటూ విసిరికర్రలా తిప్పుతూ) ఉత్తరాలూ లేచిపోడాలూనా! ఏశక్తి నేర్పిందే నీ కీవిద్యలూ! ఏమి ధైర్యం, ఏమి తెగింపు! ఎంత అవిశ్వాసం, ఎంత కృతఘ్నత! పాలోసి పాము పెంచానే!

చం:— మీ రల్లా కోప్పడతా రెందుకూ!

శా:— అవునవును. కోప్పడక మరి ముద్దెట్టుగోమన్నావా!

చం:— నేను మీ కేమీ హాని చెయ్యలేదే!

శా:— నువ్వు నాతో ఉన్నట్టే ఉండి, కుర్రకుంకతో లేచి పోడం నాకు హాని కాదూ?

చం:— అతడు నన్ను తన భార్యగా ఉండమన్నాడు. మీరు చెప్పిప్రకారం, దోషం పోవడంనిమిత్తం, పెళ్లికి ఒప్పుగున్నాను.

శా:— సరిసరి. పెళ్లంటే నాతో పెళ్లి అని నీతో స్పష్టంగా చెప్పానుగా!

చం:— కాని, మన్లోమాట! నాకు భర్తగా అతడుండడం

నా కిష్టంగాని మీరుండడం కాదు.

శా:— ఏం, నేనేమన్నా (మీాదికెళ్లి చేతులూగిస్తూ) నీ నెత్తి మీాద రాయెత్తానా, వాడు దింపాడా ?

చం:— మీారు పెళ్లంటే చిక్కు, బాధా, దౌర్భాగ్యంఅన్నారు. అతడు పెళ్లంటే సౌఖ్యం అనిపించేటట్టు ఉన్నాడు.

శా:— (అసూయతో) వెడితాడు, కుంకాక్షి గాడు!... అయితే, వాడంటే నీకు ప్రేమగావును పాపం.

చం:— అవును. అందులో తప్పేముంది ?

శా:— ఆసంగతి నాతో చెప్పడానికి నీకు గుండెవల్లా వచ్చిందీ అని.

చం:— నత్యం అయినప్పుడు ఎందుకు చెప్పకూడదూ అని.

శా:— ఓసి భ్రష్టా! నువ్వల్లా తప్పుడు ప్రేమ ప్రేమించచ్చు టే మరీ!

చం:— ఎందుకు కూడదూ! అతన్ని చూసింతరవాతగాని నాకు ఆ ధోరణే లేదు. ఆమాటే తెలియదు.

శా:— అయినా నరే, నీకోరిక తప్పు.

చం:— సంతోషం ఇచ్చే కోరిక తప్పు అనేవారెవరూ ?

శా:— (చికాకుగా) నీ సంతోషం సంతకెళ్లా, నా కది కోప కారణం కాదుటే మరీ. చంపేస్తున్నా వెక్కడో గానీ.

చం:— మధ్య మీా కెందుకూ కోపం!

శా:— అరే! మీాకు కోపం ఎందుకంటావేమిటే! మరి ఈ విషయంలో నాకు కోపం లేకపోతే ఇహా నెవడి కుంటుందే

వీట్లో వాడికీ! ... సరేగాని ఒక సంగతి చెప్పూ. నీకు నామీాద కోరికేలేదా?

చం:— మీామీా దేనా?

శా:— అవును.

చం:— ఏం చెయ్యనూ,... లేదు.

శా:— చీమంతైనా లేదూ?

చం:— చీమకాలంతైనా లేదు. అబద్ధం ఆడమన్నారా!

శా:— ఓసి తుంటరి పొగరుబోతమ్మా! (నాక్కి నాక్కి మాట్లాడతూ) ఎందుకు లేదే నీకు ప్రేమ నామీాదా?

చం:— బాగుందండోయ్. అది నేనల్లా చెప్పనూ! నేను మిమ్మల్ని ప్రేమించే ధోరణి మీాలో లేదు. మీారుకూడా అల్లాంటి ధోరణి కనపరచకపోతూరా! ఎవ రొద్దన్నారూ!

శా:— అల్లాంటి ధోరణి కనపరచడానికే కాట్టే, ఇన్నేళ్ల నించీ నిన్ను గురించి నా శ్రమా!

చం:— అయితే ఈవిషయంలో అతడే ఎక్కువ తెలిసిన వాడు. అతడు ఏ శ్రమా లేకుండానే ప్రేమించాడు.

శా:— (తనలో) ఓరి దీని సమాధానాలు తగలెయ్యోయ్! ఆఁ. నన్ను తికాయించేస్తోంది. అమాయిక స్త్రీ కూడా ఈ విషయంలో అఖండ పండితుడికంటె ఎక్కువ వాదిస్తుంది గావును. (పైకి) అయితే ఓసి వాదమ్మా! ఇంతకాలం నేను నిన్ను పెంచి పొమ్మా వెచ్చించుతా, వాడికోసమా?

చం:—సామ్మా! అత డిచ్చేస్తాడు అణాపైసల్తో.

శా:— (తనలో) హరి! చూశారా, చూశారా! ఎల్లా చెప్పెయ్యగలదో! (పైకి) సొమ్ముకాక ఇంకా బోలెడున్నాయి నేనిచ్చినవి. (వళ్లు బిగించి తక్కుతూ) ఆ వెల్లానే టక్కుల టెక్కు!

చం:— అవన్నీ కలిపి మీరనుకున్నంత విలవఉండవ్.

శా:— బాల్యంనించి నీకు ఇప్పించిన ట్రైనింగు!

చం:— అవును, అజ్ఞానంలో! ఎల్లకాలమూ అల్లా ఉండిపోనా!

శా:— ఉండకు. వాడితో లేచిపోయి విద్యలు నేర్చుకో!

చం:— తప్పకుండా. ఇంతవరకు నేర్పిందతడే. అతడికే నే నెక్కువ ఋణం ఉన్నాను, మీకు కంటె.

శా:— ఇల్లాంటి పెడసరపు సమాధానాలకి నిన్ను చంప చేసే స్తే ఎవరు నీకు దిక్కు?

చం:— ఆ ప్రజ్ఞకూడా చూపెట్టండి.

శా:— (కళ్ళు మూసుగుని కుడిచేత్తో తన నుదురు పట్టుగుని ఒక లిప్త ఆలోచన నటించి) ప్రభా! ఇంతవరకు అయిన దేదో అయింది. గతానికి నిన్ను క్షమించాను. అదంతా జరగనట్టే. ఇక నన్ను ప్రేమించు. (చిరునవ్వుతో) నాక్షమనిబట్టి నా ప్రేమనైశాల్యం తెల్సుకో! నేను సంతోషంగా ఉండడం నీ కిష్టంలేదూ?

చం:—ఎంతమాట! మీకూ సంతోషం కలగవలిసిందే అని కోరతాను.

శా:— అయితే, (నిట్టూర్పు విడిచి) నానిట్టూర్పుచూడు,

నా దీనత్వం గమనించు. ఆ మంత్రగాణ్ణిమాని, నాతో ఉండు. నిన్ను ఆదరించడమే కాదు శిరసావహిస్తాను. నా ప్రేమకి దాఖలా ఏం కావాలో చెప్పు. ఏడవమంటే ఏడుస్తాను. మొత్తుకోమంటే మొత్తుకుంటాను. జుట్టు పీక్కోమంటే తల కోడిగుడ్డులాగ చేసేసుకుంటాను. చావమంటే నవ్వుతూ పొడుచుకుంటాను. నీ మీద అదీ నా ప్రేమ.

చం:— ఆగం డాగండి. మీ ఉపన్యాసం నా హృదయాన్ని స్పృశించనేనా లేదు. నీహారం ఒక్క మాటతో నా హృదయాన్ని పిల్లిమంత్రాలు వెయించాడు.

శా:— సర్లే, మరి చాలు. పదు. ఆ కొట్లోకి పదు. (అని కుడి మధ్యకి చూపిస్తాడు) నిన్ను మరో దేశంలో ఉండే మతానికి పంపేస్తాను.

చం:— దిక్కులు చూడకుండా తిన్నగా కుడిమధ్యకి వెడుతుంది)

మా:— (గబగబా ఎడమఎదరనించి వచ్చి) అయ్యగారూ! ఆ చంద్రప్రభా, ఆ శివమూ లేచి పోయారండీ!

శా:— ఖంగారుపడకు. ప్రభ ఇక్కడుంది లే. నువ్వెళ్లి శకటం తయారుచెయించు, ప్రభని పంపించేద్దాం.

మా:— (ఎడమఎదరకి వెడుతూ) చిత్తం!

నీ:— (ఎడమ మధ్యనించి దిగాలుపడి నడుస్తూ వచ్చి) విన్నారా, శానయ్యగారూ!

శా:— ఏం ఏం? ఏం జరిగింది?

నీ:— నా కష్టం అంతా నేలపాలైంది. మా నాన్న వచ్చారు.

శా:— ఏరీ, ఆయ నెక్కడున్నారూ?

నీ:— ఇల్లానే వస్తారు. ఉండండి, నా మాట వినండి, ఇక్కడికి ఏదో ముఖ్యమైన పనిమీద వస్తారని రాశా రన్నానే, అదేమిటో తెలుసా?

శా:— ఏమిటి?

నీ:— నాకు ఆయన ఒక సంబంధం కుదిర్చాడట. తన స్నేహితుడైన సంతోషంగారి కూతురేట ఆపిల్ల. వాడూ వచ్చాడు.

శా:— సన్నేం జెయ్యమంటావ్, అందుకనీ!

నీ:— ఆ సంబంధం నాకు తప్పిపోయేట్టు చెయ్యాలి, మీరు, మా నాన్నతో చెప్పి!

శా:— అంతేనా?

నీ:— అంతే.

శా:— అయితే నిమిషం.

నీ:— ఈ చంద్రప్రభ విషయం మా నాన్నదగ్గిర రానియ్యకండి.

శా:— అల్లానే.

నీ:—(ఎడమువైదరకి చూసి) వాళ్ళొస్తున్నట్టున్నారు. ఇల్లా రండి, మా నాన్నని లొంగదీసే ఉపాయం చెబుతాను.

(కుడివైదరకి శానయ్యా, నీహారమూ వెడతారు)

స:—(ఎడమువైదరనించి వచ్చి తన వెనకాల వస్తూన్న

కాటయ్య, నంతోషంగార్లతో) ఇదేనండీ, వారిల్లూ.

కా:—ఇదే. మరే. జ్ఞాపకం వచ్చింది. సరే! నంతోషం గారూ! ఈ నరయ్య మీ బావమరిదని ఎవరు చెప్పారూ?

నం:—ఎవరూ చెప్పలేదు. నా భార్యకీ ఇతనికీ ఉన్న మొహం పోలికవల్ల నేనే పోల్చుగున్నాను.

న:—పోల్చి వెంటనే మా సోదరి మరణవార్త చెప్పారు.

నం:—అది భరించితీరవలసిందేగదా! కాని, దైవకృపవల్ల ఒక్క కూతురు ఉన్నది. ఆ పిల్లనే వీరి అబ్బాయి కియ్య నిశ్చయించింది.

న:—మీకు కూతురా! నాకు తెలియదే!

నం:—(కాటయ్యని ఉద్దేశించి) వారు చెబుతారు.

(కుడిఎదరనుంచి శానయ్యా, సీతారమూ వస్తారు)

శా:—(కాటయ్యతో) ఇదుగో కాటయ్య గారూ! క్షేమమా?

కా:—చిత్తం.

శా:—రండి. ఎంతసేపైంది వచ్చి?

కా:—ఇప్పుడిప్పుడే.

శా:—మనం కలిసి కొంతకాలం అయింది.

కా:—మరే. మేం ఇక్కడికి కొచ్చిన పని ఏమిటంటే!

శా:—తెలును తెలును.

కా:—అల్లానా! అయితే మరీ మందిదీ. చిక్కే లేదూ.

శా:—చిక్కు! కొంచెం ఉంది. మీవాడు ఈవరకే ఓపిల్లని

స్వయంగా ఎన్నుకున్నాడట. మీరు తెచ్చిన సంబంధం అతనికి అనవసరంట. కాని, నన్నడిగితే, మీరు కుదిర్చిన పిల్లనే అతనికి ముడెట్టి, అతనిరోగం పెంద్రాళే కుదర్చండి.

సీ:—(తనలో) ఓరి ద్రోహీ!

వ:—ఫలానాసంబంధం నా కొద్దు మొర్రో అనేవాళ్లకి ఆ సంబంధమే రుద్దడం అధర్మం.

శా:—ఒస్! తండ్రిమాట కొడుకు పాటించకపోడం అంతకంటె అధర్మం.

కా:—అంతవరకెందుకు ఆగండి. మాకుర్రాడు నామాట వినడంపూచీ నాది!

శా:—అల్లా అన్నారు, బాగుంది.

కా:—మీరన్నప్రకారమే చేస్తామండి, శానయ్యగారూ!

వ:—శానయ్యగారు కాదండి, అరుణాచలంగారనాలి ఇప్పుడు.

కా:—పోనీ, అల్లానే అందాం.

సీ:—ఓరి బాబో, శానయ్యగారేఅరుణాచలంగారా! చాలా నాటకం అయిందే!

శా:— (సీహారం కేసి) అదిరా అబ్బాయి రహస్యం! (తీవ్రంగా) మరి చూడు నాప్రభ. ఏమండోయ్! మీవాడి పెళ్లి తక్షణం చేసెయ్యండి.

కా:—మేం కోరేదీ అదే! మీదే తరవాయి.

శా:—(తోచక) నాతరవాయేమిటి!

కా:—పెళ్లికూతుర్ని పిలిపించండి.

శా:—అదేమిటీ?

కా:—మేం ఇక్కడి కొచ్చిన పని మీరు ఎరుగుదుం అన్నారే!

శా:—(ఆశ్చర్యంతో) ఏమిటి ఎరుగుండడం!

కా:—వినండి. ఈ సంతోషంగారికి సరయ్యా సోదరివల్ల గాంధర్వంలో ఓ పిల్ల పుట్టింది. ఆ పిల్ల మీదగ్గి రుంది.

శా:—(తెల్లపోయి) నాదగ్గిరా!

కా:—అవును.

స:—ఆశ్చర్యంగా ఉందే!

కా:—మొదట ఆపిల్లని రహస్యంగా ఓ పల్లెటూరిఅమ్మికి ఇచ్చేశారు. తరవాత వీరూ, భార్యా విదేశంలో ఉద్యోగానికి వెళ్లారు. అక్కడ వీరి భార్య గతించింది. వీ రిటీవల వచ్చేశారు. పిల్లని గురించి ఆ అమ్మిని కనుక్కుంటే మీరు కొనుక్కున్నా రని చెప్పింది.

స:— అమ్మాయికవు చంద్రప్రభ నా మేనగోడలా! సంతోషమే.

కా:—ఆ అమ్మినికూడా ఖర్చిచ్చి ఈయన రప్పించారు. కావలిస్తే వచ్చి ఋజువుఇస్తుంది.

శా:—(నిశ్చేష్టు డవుతాడు)

స.—శానయ్యా! నీబాధ నాకు తెలుసు. కాని, నువ్వు ఆడారిభర్తవు అవడం తప్పిపోయింది. ఈదెబ్బతో నువ్వు పెళ్లే మానే సెయ్.

శా:— (తన ఆశయాలన్నీ ఆకస్మాత్తుగా అడుగంటి పోడంవల్ల విచారం ఆపుగోలేక, గుప్పిళ్లు పట్టి, ఒక చెయ్యి విడిచి ఒక చేత్తో కళ్లు కప్పెట్టుగుంటూ, తల ఆడించుతూ, ఇటూ అటూ తూలుతూ, పక్క చెక్కలకి కొట్టుగుంటూ ఎడమ ఎదరకి నిష్క్రమిస్తాడు)

సీ:—(కుడిమధ్యకి తిరిగి) చంద్రప్రభా! (అని కేకేసి అటువెళ్లి చంద్రప్రభని తీసుగొచ్చి, సంతోషంగారితో) ఇదుగోనండి మీ అమ్మాయి!

సం:—(ప్రభతో) అమ్మా! రా

చం:—నాయనా, నమస్కారం.

స:—శానయ్యగారి కృపకి బహుమతీఇయ్యాలి.

సీ:—బహుమతీమాట దేవుడికి తెలుసు, ఆయనదగ్గిర సేమ-బదులుపుచ్చుగున్న వందా తీర్చాలి ముందు.

స:—అంతకంటె ముందు అన్నీ మన మేలు కోసమే చేస్తూండే దేవుణ్ణి ఆరాధించాలి!

(శాటయ్య చంద్రప్రభ చెయ్యి, సంతోషం సీహారం చెయ్యీ పట్టుగుని కలుపుతూండగా, ఎడమఎదరనించి ఈలా, చిటికెలూ వేసి ఆడుతూ మాలోకం వెనకాలే వెడుతూండగా తెర పడుతుంది)

---

# పూర్వరంగం

[ఈ ఆట ఆల్ ఇండియా రేడియో మెడ్రాస్ కేంద్రంనించి 5-6-1945 తేదీని మొదటి పర్యాయం ప్రసరింపబడింది]

పాత్రలు:

శాస్త్రయ్య.............(తండ్రి)

సరళ................(కూతురు)

మాలోకం...........(నౌఖరు)

సువర్ణం..............(వరుడు)

ధన్ }
మన్ }..............(నాటు డాక్టర్లు)

[ప్రసారకులు: భమిడిపాటి కామేశ్వరరావు, కె. సరోజిని, మగ్గిరాల సత్యనారాయణరావు, జోస్యుల సత్యనారాయణ, పాలగుమ్మి వీరభద్రేశ్వరరావు, వై. ప్రసాద్]

## 1వ రంగం

(శానయ్య ఇంటి వీధిగది — చిన్నబల్లా కొన్ని కుర్చీలూ — LF నించి శానయ్య వచ్చి పచారు చేస్తాడు)

శా:— అబ్బ! ఏదో ఓటి ఏదో ఓటి వస్తూనే ఉంటుంది, చిత్ర క్షోభ! బతికున్న ప్రతీవాడూ చచ్చేదాకా బతికి తీరాలి, దిక్కుమాలి చెర!! సరి, బతగాలంటే భుక్తి, ఆ భుక్తి కోసం డబ్బూ, ఆ డబ్బుగురించి నౌఖరీ తప్పవుగదా! పొట్ట కూటికి నౌఖరీ తప్పనప్పుడు వ్యక్తి అందులో కూరుకు పోవలిసిందేగాని, ఇవతలకి రావడానికి వీలుండదు. ఇక, నా నౌఖరీ వంటిదాల్లో చావడానికి కుడా సెలవు, ముందుగానే మంజూరు కావాలి. ఇహ, నా కుటుంబానికి చెందిన విడి వ్యక్తుల్నిగురించి నేను యథావిధిగా ఆలోచన చెయ్యడానికి నాకు తీరుబడి ఎక్కడేడుస్తుంది! అబ్బబ్బ! తండ్రికి వచ్చిపడే విషమసమస్యలలో కల్లా గడ్డురకం, కూతుళ్లని గురించిన సమస్యలు. మా సరళ మాకు ఒక్కగాని ఒక్కపిల్ల! నేను తండ్రినిగనక చెబితే బడాయనుకుంటారేమోఅని చెబుతూండను గాని, — విద్యావినయాల్లో, ఆటపాటల్లో, అందచందాల్లో, మా సరళని చెప్పి మరోర్ని చెప్పాలి. మా చిన్ని సరళ ప్రతి నిత్యమూ కలకలలాడుతూండే మహా లక్ష్మి! అలాంటి రత్నం లాంటి పిల్లకి అకాత్తుగా తగనిమనస్తి పట్టుకుంది. ఆ మనస్తి పయినం అది చెప్పదు,ఇవతలవాళ్లకి తోచదు. ఏమీ కూతరా

అని అడిగితే, పరధ్యానంగా ముక్కడం, ఊఁ హూఁ ఉః అనడం, బారెడేసి నిట్టూర్పులు విడవడం! ఈ సుస్తీ మానవత్తూ పెళ్లి సుస్తీ అంటుంది మా ఆవిడ! మా ఆవిడకి ఏం తెలుసూ, అడవి! అయినా సరే ఆవిడ, పిల్లనిగురించి నాతో ఏక వితండ వాదం! ఈ సుస్తీ తగ్గితేగాని పెళ్లిమాట ఇంటో స్మరించద్దని నేను శాసించేశాను. పిల్లకి ఇంకా పద్దెనిమిదేళ్లేనా వొచ్చాయో లేదో అప్పుడే పెళ్లేమిటి పొమ్మని మా ఆవిణ్ణి గట్టిగా మందలించి కసిరేశాను. కల్యాణం రావద్దూ! కల్యాణం వస్తే పెళ్లి ఆగనూ ఆగదు. ఈ లోపున కానూ కాదు! కాని, పిల్ల పెళ్లి విషయంలో తనకీ హక్కుందని మొదలెట్టి మా ఆవిడ మరి నాలుగు ఆకులు ఎక్కువ చదివి, మూడుసార్లు నెత్తి బాదుకుని, రెండుసార్లు నూతులో పడుతున్నానని బెదిరించి, ఒక్కసారి పుట్టింటికి తుర్రుమంది. ఎందుకుటా! పుట్టింటారి తాలూకు ఓ మంచి గొప్ప సంబంధం ఉందిటా, వాళ్లకి అంతా డబ్బేటా, పిల్లాడిల్లాఉన్నా సరే వాళ్లు మా పిల్లదాన్ని తమ ఇంటో పడేసుకుంటారేమో అనుకుంటుందిట! నేను కూడా అల్లాంటి మూర్ఖత్వంలో పడక, పెళ్లిమాట దేవుడికి తెలుసును, ప్రస్తుతం పిల్లదానికి వచ్చిన సుస్తీ ఏమిటా, ఎల్లాకుదురుతుందా, అని వాకబు చేస్తూనే ఉన్నాను. బంధువుల్నీ స్నేహితుల్నీ ఎందర్నో అడిగి చూస్తూన్నాను. తెమలటంలేదు. (నిట్టూర్పుతో) కాని, చిక్కులు పడాలి. ఏంజెయ్యనూ!...ఒరేయ్, మాలోకం!

మా:— అయ్యో (అంటూ LM నించి వచ్చి) చిత్రం!

శా:— ఏం చేస్తున్నావ్?

మా:— తోట్లో పువ్వులు కోస్తున్నానండి. ఏమండీ?

శా:— ఏమీ లేదు. ఎవరో వచ్చి వెళ్లారు. వీధిగేటు తలుపు వేసిరా. (అని RM కేసి చూపిస్తాడు)

మా:— చిత్రం. ఇందాకానే వేశానండి.

శా:— ఓరి, అసాధ్యుడవే! వెళ్లినవార్ని చూశావా?

మా:— చిత్రం. మీ అన్నగారి అమ్మాయండి. నరేగానండి అయ్యగారూ! రొంకుమూకు రోజుల్నుంచి తమదగ్గిరికి చాలా మంది వస్తున్నారు, వీరంతా శాకీలకోసమేనాండీ!

శా:— కాదు కాదు. వేరే ఒక ముఖ్యమైన పనిమీద.

మా:— అయితే నాకు తెలుసునండి.

శా:— ఏడిశావ్. తెలిస్తే చెప్పు మరీ.

మా:— ఏముందండీ! అమ్మాయిగారిని గురించి మీరు వారిని వలహా అడుగుతూ ఉండి ఉండాలి.

శా:— ఓరి వీనుగా, నిజమే. నీకెల్లా తెలిసిందిరా!

మా:— నిజం చెప్పనాండీ!

శా:— చెప్పూ!

మా:— మీ మొహంకేసి చూడ్డంతోటే తెలుస్తోందండి. పైగా మీరు ఒక్కరూ కూచుని అమ్మాయిగార్ని గురించి పైకి మాట్లాడుకుంటూంటారుగా!

శా:— నీ మొహం ఈడ్చా, నిజమేరా, ఇట్టేకనిపెట్టావ్. నల

హాలు ఇవ్వడానికొచ్చిన వాళ్ళల్లోనూ ... మా మేనగోడలు ఒకర్తె. మా మేనగోడల్ని అడిగితే ఏమంటా...

మా:— మీ మేనగోడలంటే బజారువక్క వీధి డాబాలో ఆవిడేనాండీ?

శా:— అవును.

మా:— అయితే ఆవిడేమందో నే చెప్పేస్తానండి. అమ్మాయి గారికి వజ్రాలూ రత్నాలూ కొనిపెడితే ఈవ్యాధి పోతుంది అని చెప్పిఉండాలి.

శా:— (ఉలుకుతూ) ఓరి నీజోస్యం మండా, రైటేరా! నువ్వు ఇది ఎల్లా చెప్పగలిగావ్?

మా:— ఆవిడ భర్త వజ్రాల వ్యాపారం చేస్తాడు. ఆ సలహా మీరు వింటే వాళ్ళకి లాభం.

శా:— అవున్రోయ్, నాకు తోచలేదు. నా స్నేహితు డొకడొచ్చాడు. ఆయనంటాడూ, ఈ వ్యాధి తగ్గిపోవాలంటే మంచి మంచి బొమ్మలూ చిత్రాలూ కొని అమ్మాయిగది అలంకరించమంటాడు.

మా:— ఒస్. అదాండీ! ఆయన బొమ్మలు రాస్తాడుగావును. చెల్లటంలేదుగావును.

శా:— మరేరోయ్! ఇంకా, మా పొరుగువారి అమ్మాయిని సలహా అడిగాను. అడిగితే, ఆ పిల్ల అందీ, వెనక మీ సరళ ఒక యువకుణ్ణి ప్రేమించిందీ, సరళని అతడికిచ్చి పెళ్లి చేస్తే సరళ వ్యాధిపోతుంది, అంది — మా ఆవిడ అన్నట్టే!

మా:— ఈసలహా బాగానే ఉందండీ, నా అభిప్రాయంలో.

శా:— బాగుందీ! నీమొహం నీకేంతెలుసూ! విను. ఆ అమ్మాయికి మరో కొత్త గొప్ప వాడిమీద మక్కువగావును, వాడికి మన సరళ మీద అభిప్రాయంగావును! అందుకని పాతవాడికి మన సరళని ముడెట్టేస్తే, కొత్తవాడు తనికి మిగుల్తాడుగదా అని, ఆపిల్లగోల!

మా:— నిజమేనండోయ్! సలహా ఇచ్చేవారికి ఏరూపంగానో లాభం ఉండని సలహా పుట్టడమే కష్టం

శా:— మరేమిటనుకున్నావ్. సరి, ఇందాకా మాఅన్నగారి అమ్మాయి వచ్చింది. ఆ అమ్మాయి అంటుందీ — "సరళకి పెళ్ళి అసలు కూడదూ! సరళ శరీరతత్వం — సున్నితమూ, కోమలమూనూ! పెళ్ళిగనక అయి, కానుపుగనక వచ్చిందా, సరళ పరలోకానికి టికెట్టు కొనుక్కుందన్నమాటేనూ, అందుకని సరళకి ఈమామూలు సంసారావరణ తప్పించి సన్యాసినీ మతంలో పేరువెయిస్తే దాని తత్వానికి అనుకూలిస్తుంది!" అని.

మా:— అదేం సలహాఅండీ, దిక్కుమాలి సలహా!

శా:— ఎందుకేమిటీ! సరళ సన్యాసిస్తే నా ఆస్తికి వారసత్వం తనదేకదాఅని! ఇల్లాంటి పాడుసలహాలన్నీ వాళ్ళవాళ్ళ పీపుల్ని కొట్టేసి, వాళ్ళని శీఘ్రంగా సాగనంపేశాను. నాజూకు సలహాలయొక్క దురుద్దేశాలు ఇల్లాఉంటాయి!

మా:— మరి?

శా:— మరా! (LB కేసి చూపించి) అదుగో, సరళ

వస్తోంది. నువ్వెళ్ళిపో, కొంచెం నేను! (అని RM కేసి చూపిస్తాడు)

మా:— చిత్తం (అని వెళ్ళిపోతాడు)

శా:— అమ్మా! సరళా!

స:— (నిట్టూర్పులు)

శా:— అమ్మాయి! రా! ఎల్లా ఉన్నావ్! వంట్లో ఒక్క శవ్య నసిగాఉందా! అదే దుఃఖమూ అదేవిచారమూ అయిపోయిందేమే! ఏమొచ్చిపడ్డదే కూతురా, కాస్త, చెప్పి పారెయ్యవే నాతోటీ — చెప్పమ్మా, త్వరగా చెప్పు — పిచ్చి పిల్లా, వెర్రితల్లీ — చూాను, నేను నాన్నని కాదమ్మా మరీ! చెప్పు భయంలేదమ్మా, చెప్పెయ్, మాట్లాడవేమే! పోన్లేవే అమ్మా! నీ వరసచూస్తే నాకు మతిపోతోందే! చెప్పవమ్మా మహారాజా! చెప్పు! ఈసంగిద్ధం నాకు ప్రాణపోకటగా ఉంటే బాబూ! ఎందుకూ అంతపరధ్యానంతో ఉన్నావ్! కాస్తంత కారణం చెప్పేశావా, నీవిచారం తొలగించడానికి నేను చెయ్యంది ఉండదు. పోన్లేవే అబ్బా. ఇహా నేనుమట్టుకి చస్తానా ఏమిటి!

స:— (ఏమీ మాట్లాడదు)

శా:— మరోరికి మళ్లే డ్రెస్సూ అదీ నీకు లేదనా? కొత్త రకం వజ్రాలూ అవీ కొనుక్కోవాలనా?

స:— ఉఁ హుఁ ఉఁ

శా:— కాదూ! కాకపోతే నీగదిలోకి తగ్గ బొమ్మలూ

చిత్రాలూ అవీ లేవనా?

న:— ఊఁ హాఁ ఊఁ

శా:— అదీ కాదూ! మరేమిటే నీ యిల్లు బంగారం గానూ! పోనీ ఫిడేలుంగీ వీణ లాంటిది వాయిస్తూ పాటగీట లాంటిది నేర్చుకోవాలనా?

న:— ఊ హాఁ ఊఁ... (నిట్టూర్పు)

శా:— అదికూడా కాదూ! అల్లాయితే నన్ను చంపవే తీరి పోతుంది, సుబ్బరంగానూ! పోనీ, ఎవడేనా కుర్రకుంక వీడికి మనస్సుపోయి, వాణ్ణిగాని పెళ్లాడాలని ఆలోచన చేస్తున్నావా అంటే...

న:— ఊఁ

శా:— (వినిపించుకోకుండా) నీ అంత చదువుకున్నది, అమాంతంగా, ఆ రీతిగా చెయ్యదుగదా! అందుకని కారణం అదీకాదు.

మా:— (RM నించి వచ్చి) అయ్యగారండీ!

శా:— ఏమిరా, ఎందుకూ?

మా:— మీకోసం ఎవరేనా వచ్చారేమో, చూసిరానా అండీ?

శా:— అక్కర్లేదు. నువ్వుచూస్తేగాని రారా ఏమిటి, బోడివి.

మా:— (మెల్లిగా) అయ్యగారండి. అమ్మాయిగారి విచారానికి కారణం తెలుసుకున్నారా అండీ.

శా:— ఏమో, నా బుర్ర పాడవుతోంది.

మా:—(మెల్లిగా) పోనీ, నేను అడగనా అండి, నాతోగాని చెబుతారేమో!

శా:—నీ మొహం! నాతో ఇంత చెప్పింది, నీతో ఇక చెబుతుంది. తిక్క తిరిగేదాకా ఊరుకుంటే సరి! ఇల్లాంటివాళ్లుంతే! (ఈనడింపు నవ్వు)

మా:—(మెల్లిగా) కాదండి. మీరూరుకోండి నే అడుగు తాను (గట్టిగా) సరళమ్మగారూ! ఏమిటండీ, ఈ కోపం! ఆశ్చర్యంగా ఉంది. చెప్పెయ్యండి. నాన్నగారూ నేనూ తబ్బిబ్బు పడిపోతున్నాం. చెప్పండీ! మీరు కోరుకోడమూ, నాన్న గారు కాదనడమూ, ఉంటుందా? ఏం కావలిస్తే అది తెస్తాం అన్నారుగా! మీ చిత్తం వచ్చినట్టు కోరుకోమని మీకు స్వాతంత్ర్యం ఇచ్చారుగా! మీరు షికార్లుమానుకున్నారు, పార్టీలుమానుకున్నారు. ఎవరేనా మీ మనస్సుకి బాధ కలిగించారా, లేక మీ మనస్సు ఒదులుచ్చుకున్నారా? లేక, మీ మనస్సు హరించారా?...ఆఁ అదుగో...

స:—(నిట్టూర్పు)

మా:—మీ మొఖంలో తెలుస్తోంది. నిజంచెప్పండి. ఎవరో అబ్బాయి లేరూ? అతణ్ణితెచ్చి మీ నాన్న మీకు పెళ్లి చేస్తే బాగుంటుందని మీరు మనస్సులో రహస్యాలోచన చేసు కోటంలేదూ? ఆఁ...దాచకండీ! నిజం దాగుతుందిటండీ! ఆ మాట పైకి అనెయ్యక ఇన్ని వేషాలెందుకమ్మా, తల్లీ! (శానయ్యతో) కిటుకు తెలిసి పోయిందండి, అయ్యగారూ!

శా:— ఇంత పెంకితనం అయితే, నేను సరళతో మాటే అణ్ణు...

న:— నాన్నా ! నా మనస్సులో కోరిక పైకి...

శా:— ఊరుకో, నీమీదుండే ఆపేక్షంతా చంపుకున్నాను...

న:— నేనూ...

శా:— పెంచి పెద్దదాన్ని చేసి నందుకు, తగ్గ శాస్తి చేస్తోంది, మొట్టుకి...

మా:— అదికాదండీ, అయ్యగారు!

శా:— నాకు నిజంగా చాలాకోపం వచ్చింది, ఇంకావస్తోంది కూడానూ!

న:— కాదు, నాన్నా

శా:— ఇల్లాంటి వాళ్లని వినిపించుకోవాలి కూడానూ!...

మా:— అయ్యగారూ!

శా:— గ్రంథ సాంగురాలు బయల్దేరింది...

న:— మరీ!

శా:— కృతఘ్నురాలు...

న:— నన్నా

శా:— చదువుకుంటే మాత్రం, వ్యాధి పైకి చెప్పకుండా కాల్చుకుతినేస్తోంది మరీను!...

మా:— అయ్యా! అమ్మాయి కోరుకునేది భర్తనిట.

శా:— పరమ అసహ్యం వేసింది, రోతపుట్టింది.

మా:— అమ్మాయికి భర్త కావాలిట

శా:— అందుకని నీకూనాకూ చెల్లు అనేస్తాను

మా:— అమ్మాయికి భర్త కావాలిట

శా:— నా కూతురు కాదు, బేవారసురాలు పొమ్మంటాను

మా:— భర్తట, భర్త, భర్త

శా:— ఒక్క వాక్యం వినను, ఒక్క మాట వినను, ఒక్క అక్షరం వినను — మనస్సు చిట్టం కట్టింది — పోతాను. (అని RM కి వెళ్ళిపోతాడు) దూరంగా ఎక్కడికో పోతాను. (వెళ్ళిపోతాడు)

మా:— చూశారాండీ, సరళమ్మగారు! వినిపించుకోనివాళ్ళ చెముడు అసలు చెముడుకంటె అన్యాయం.

స:— దానికేంగాని, నేను అసలు సంగతి చెప్పాల్సి వచ్చింది కొంత తప్పే, మొదట్లోనే చెప్పేసి ఉండవలసింది.

మా:— పోనీ, యథార్థం నాతో చెప్పారు కారేం, మీ నిమిత్తం నా ప్రాణం అర్పిస్తాను కదమ్మా!

స:— మా పొరుగమ్మాయితో చెప్పానుగా! ఆ అమ్మాయి వలహా మా నాన్న విన్లేదు.

మా:— మీ అమ్మగారితో చెప్పిచూశారా?

స:— డబ్బూ దర్జా దర్పం హోదా కీర్తి ఇటువంటి ఉంటేనే గాని ఏ నరుణ్ణీ ఏ వరుణ్ణీ ఆవిడ మెచ్చదు అవన్నీ ఉంటే నరుడు ఏ నరుడైనా వానరుడైనా ఫర్వాలేదుట. అందువల్ల నేకోరుకునే వరుడు ఆవిడకి నచ్చడని, నేను గ్రహించి ఆవిడతో చెప్పలేదు.

మా:— అమ్మా! మీ వరుడు సువర్ణం గారేనా?

న:— ఔర పిడుగా! ఎల్లా గ్రహించావ్?

మా:— మీరు పైని చెప్పిన లక్షణాలులేకుండా విద్యా వినయం సౌశీల్యం గురించి పేరుమోసినవాడు ఆయనే గనక!

న:— ఆయన మనస్సు నాకు తెలియదు. నన్ను ఆయన స్వీకరిస్తారో లేదో! చదువుకున్న కాలంలో ముఖపరిచయమే కాని, మాటైనా ఆడలేదు.

మా:— అమ్మా! వారిపూచీనాది. సరళమ్మగారి గురించి నా తెలివిధారపోస్తాను.

న:— నీ మాట సరే, ధైర్యమే. నాన్న...

మా:— నాన్నా లేదు ఏమీలేదు, ఊరుకోండి. సవ్యమైన వ్యాపారం నాన్నగారుమాత్రంఎల్లాకాదంటారండీ? ఆయన మీ చిన్నప్పుడులాగ ఇప్పుడుమీమీద అథార్టీ ఎల్లా చెయ్యగలరండీ? పెళ్లి మీకే కదండీ! మీరు ప్రాజ్ఞులు, మీ పెళ్లి నిమిత్తం మీకు ఓటు ఉండద్దూ! తక్కిన వాళ్లకి ఓటుందుకూ? పోనీ, తక్కిన వాళ్లకి ఏ పాతిక ఓటో పరక ఓటో ఉంటే ఉండచ్చు గాని, నిండుఓటు కూడదు. నిండుఓటు మీ కుండడం న్యాయం! ఉందుగూ! నేను చిన్న ఎత్తువేసి నాన్నగార్ని గమ్మత్తు చేసేస్తాను. మీరు మీ సుస్తీ, కొంచెంజోరుగా అభినయించండి. ఇవతలవాళ్ల మాటలు వినిపించనట్టు కూడా నటించండి.

న:— నువ్వు?

మా:— నేనా ఎల్లాగో వచ్చి మొత్తుకుని మీ నిమిత్తం వైద్యుల్ని తెప్పించి, మీసుస్తీకుదర్చగల వైద్యుడు ఈయనే

అని చెప్పి,ఏమాసికలోపడి సుశర్మగారిని తీసుకొస్తాను.

న:—ఆలస్యం కాకూడదు. ఆలస్యం అయితే మా అమ్మ ఏదో తనికి వచ్చిన సంబంధం మూటకట్టుకుని చక్కావస్తుంది.

మా:—ఆలస్యం క్షణంకూడా ఉండదండి. నా వ్యాపారం అంతా చిటికెల మీద నడుస్తుంది.

న:—మానాన్నగారికి కోపం తెప్పించకూడదు సుమా!

మా:—నాన్నగారికి మిక్కిలి అంగీకారంగాఉండేటట్టు, వారి కళ్లముందే గ్రంథం నడిపిస్తాం, చూడండి. మీరువెళ్లిలోపల హాలులో పడుకోండి. వీధిగేటు దగ్గిరిగావేసేసి, అర్చిదారి పక్కగా మెట్లమీదపడి ఆయన లోపలికి రావడం కనిపెట్టి దీర్ఘాలు మొదలెడతాను. వెళ్లండి.

న:— నరే. జాగ్రత్త. (సరళ LM కి, మాలోకం RM కి పోతారు)

తెర

## 2వ రంగం

(రెండవ తెర ఎదట)

శా:— అబ్బ! తలకాయి వొంచుకుని పోతూందాం అనుకుంటూంటే మళ్లీ ఏదో ఓటి వస్తూనే ఉంటూంటుంది. గేటు వేసుంది. తలుపూవేసేఉంది. సరళ లోపలికెళ్లినట్టుంది. ఇందాకా మాలోకమేకాకుండా సరళకూడా పెళ్లికావాలీ

అన్న మాట నాకు స్పష్టంగా వినిపిస్తూన్నా, తక్షణ సమాధానం చెప్పలేకా, చెప్పగలిగినా దానికి తక్షణాచరణ వీల్లేకా, వినిపించనట్టు నటించాను. ఎల్లానూ ఊరుకోవలిసినవాణ్ణే. పెళ్లి అవసరం, పిల్లనోటంట వినికూడా ఊరుకున్నాననే కంటె వినక ఊరుకున్నాననుకోడం ఎక్కువ గడుసుదనం! పెళ్లి గురించి పిల్లంటే తొందర పడచ్చు; గాని తల్లిదండ్రులు ఎంత నిదానించాలి! పిల్లదాని తొందరకీ తల్లిదండ్రుల నిదానానికీ సామరస్యం కుదరాలంటే ఆలస్యం కాకమానుతుందా? సంవత్సర మాత్రం ఉంటే చాలనే ఊరగాయి వెయ్యడానికే బోలెడు ఆరాలు తీసేవాళ్లుంటారే! అలాంటప్పుడు కల కాలమూ నిలవ వలిసిన సమ్మేళనం చేసేటప్పుడు ఎంతతటపటాయించాలీ! వివాహం అనేది ఛట్టున ఎల్లా? అన్ని ధరలతో పాటూ పెళ్లి కట్నపు విలవలుకూడా మూడునాలుగు రెట్లు పెరిగిపోయాయి గదా! దీనికి ఓ కంట్రోలూ దిబ్బా ఉండాలని ఎవళ్లూ ఆలోచించ రాయిరి! అయినా సరే, డబ్బు ఎల్లానో తెచ్చాం అనుకోండి. వరుడుమాట! పిల్లకంటె ఎక్కువ కాకపోతే అదే పాయె, పిల్లతో సమానంగా నేనా వరుడుకి విద్య ఉండద్దూ, సమానంగా వయస్సు ఉండద్దూ, సమానంగా కులగోత్రాలూ, నామరూపాలూ, పనిపాటలూ ఉండద్దూ! అలాంటి వరుడు దేశంలో ఉండడే! డబ్బెట్టినగ తయారు చెయించినట్టు డబ్బెట్టి వరుణ్ణికూడా తయారు చెయించగలమూ! మొగాళ్లల్లో ఆరీతి సంస్కారం లేందే అల్లాంటి వరుళ్లు ఎల్లాఉంటారు? ఉంటే

గదా దొరకడం. ఒకవేళ ఏనూటికో కోటికో ఒకడు ఉంటూన్నా, వాడూ వాణ్ణి అంతవాణ్ణిగా చేసినవాళ్ల నాన్నా కలిసి తాటిచెట్టెక్కి మొవ్వులో కూచుంటారు. అల్లాంటివాణ్ణి కూడా దింపిమనం తేగలిగినా వాడు పిల్లకి నచ్చుతాడో నచ్చడో! వరతులు హెచ్చిన కొద్దీ ఫలితం తగ్గిపోతుంది. మా పిల్ల సుస్త్రీ కాదరడంతోటే దాని వివాహం సంగతి, నా చెయ్యి ఎల్లానూ దాటిపోయింది గనక, దాని ఇష్టం అంటాను. ధైర్యంగా అదే చేసుకుంటుంది. కాని, పెద్ద భయం ఏమిటంటే ఇల్లాంటి వాళ్ళంతా తలో దారీ తొక్కుతున్నారు. సుగాత్రి తుంటర్ని చెట్టపట్టింది, మరో అమ్మాయి సుముఖి అక్షరశూన్యుడికి అంకితం అయిపోయింది, సుకేశి ఒక జంతువు లాంటి వాణ్ణి నెత్తిమీదకి తెచ్చుకుంది, సునేత్రి భార్యా పిల్లలూ గలవాణ్ణి మానుకుంది, సుకర్ణి ఒక వరహీనుడితో స్మృతిగలిపింది. ఒక సుహాసి నవ్వులపాలైంది, ఒక సుదంతి రచ్చకెక్కి గడ్డికరిచింది, ఒక సుహా విదేశీయుణ్ణి పీడనచేసింది, మరొక సురుచి వివాహం విసర్జించింది. అయితేం, మా పిల్ల నిదానం వేరు! అల్లా ఒక్కినాటికి చెయ్యదు. సరే సరే. ఆ గోషంతా ఇప్పుణ్ణించీ ఎందుకూ! ఈ సుస్త్రీ సమ్మతించిన తరవాత ఆ ఘట్టం ఎల్లానూ ఉండనే ఉంది. — ఆఁ. ఆఁ. ఏదో ఏడుపు వినిపిస్తోంది! మా లోకం గొంతికే! (అని LF కి నమ్ర దించగా, రెండవ తెర లేస్తుంది. LM నించి మళ్ళీ వెంటనే వస్తూ RM ని R. కేసి తిరిగి, ఏడుస్తూన్న మా లోకాన్ని

చూసి) ఏదో జరిగింది, ఏకో జరిగింది! పీకు తెగ ఏడుస్తున్నాను. నేను ఇందాకా అమ్మాయిని అంత కోప్పడకుండా ఉండవలిసింది.

మా:— అయ్యో, ఎంత కర్మమండీ! ఎంత ఆపత్తు మీద పడ్డదీ! మా అయ్యగారు ఎంత దౌర్భాగ్యులో కదా!

శా:—( LM నించి మెల్లిగా విచారంగా RM కేసి జరుగుతూ) ఏమిటి చెప్మా వీడి ధోరణీ!

మా:— మా అయ్యగారు ఏమవుతారో కదా ఈ వార్త వినే నాటికి!

శా:— (కంగారుగా) వార్త ఏమిటో!

మా:— అయ్యో, చిట్టితల్లిగారూ, అయ్యో అయ్యో (అని కుసిల్లి బారుమంటాడు)

శా:— హాయ్యో హాయ్యో, కొంప పడిపోయింది.

మా:— అయ్యో (అని చీత్తాడు)

శా:— (వణుకుతూ). మాలోకం!

మా:— కర్మం ఎవరు తప్పించగలరూ?

శా:— (కొంచెం గట్టిగా) మాలోకం!

మా:— ఎంత ప్రమాదం!

శా:— (ఏడుస్తూ మరీగట్టిగా) మాలోకమోయ్!

మా:— ఏమి దురదృష్టం!

శా:— (బిగించినపళ్లతో దీర్ఘాలుగా) ఒరేయి! ఇల్లా చూడవేమిరోయ్!

మా:— అయ్యో అయ్యో, వచ్చారాండి!

శా:— ఆ. ఏమిటీ!

మా:— మరండీ! (అని గుటకేస్తాడు)

శా:— (విచారంతో) సంగతేమిటో. తేల్చరా నీదుంపతెగా!

మా:— సరళమ్మగారండి.

శా:— (చాలా రకాలుగా ఏడుస్తూ) అయ్యో, అయ్యో!

మా:— అదేం ఏడుపండీ, మరీనూ! ఎవరేనా నవ్వుతారూ!

శా:— (కొంచెం శాంతంగా) అయితే మరి చెప్పు త్వరగా!

మా:— అమ్మాయిగారు, మీకు ఎదురాడలేక, మీ దారుణ కోపం తట్టుగోలేక, అమాంతంగా తన గదిలోకెళ్లి, కాలవవేపుండే కిటికీ తీశారు.

శా:— హాయ్యో, హాయ్యో కూతురా

మా:— ఆపళంగా, నన్ను పిలిచి, "నాన్నగారి కోపం ముందు నే బతకను. నాన్నగారు నన్ను కూతురే కాదంటాం అన్నారు. పోతాను." అన్నారు.

శా:—(విచారంగా ఏడుస్తూ) కిందికి దూకేసిందిగావును!

మా:— లేదండి అయ్యగారు. నేను 'అమ్మాయిగారు, అమ్మాయిగారు, వద్దు వద్దు' అని బతిమాలుకున్నాను. ఆవిడ మెల్లిగా, కిటికీమూసేసి, దిగి, మంచంమీద పడుకుని, దొర్లి ఏడిచి, మొత్తుగుని, నోరార్చుగుపోగా, గుడ్లు తేలేసి, కర్రబారి, మూర్ఛిల్లి పోయారు!

శా:—అయ్యో సరళా, అయ్యో అమ్మాయీ, నడు నడు.

మూర్ఛ !

మా:—నేను మొహంమీద నీళ్లుకొట్టానండి. తెలివొచ్చింది: కాని, తిరగపెడతూంటుంది. (విచారంగా) ఈ రాత్రి గడవడం కష్టమండీ, బాబూ !

శా:—అయ్యో! బ్రాందీ ఇప్పిస్తే. సరే. నువ్వెళ్లి పక్క వైద్యుణ్ణి పిల్చుకురా!

మా:—ఊళ్లోకి ఇటీవలే కొత్తవైద్యుడొచ్చి అవతలవీధులో దిగాడట, ఆయన్ని వెతికి తీసుకు రానాండి ?

శా:— అబ్బ! వెతగ్గాని కిప్పుడు వ్యవధి ఏదిరా ? వెంటనే ఈపక్కఇద్దర్లో ఎవరుంటే వార్ని తీసుకుచక్కారా ! యోగం!

మా:— పోనీ అల్లానే నండి, మీచిత్తం! (అని RM కి వెడతాడు)

శా:--(ఒక్కడూ కంగారుగాపచారుచేస్తూ) నయమే. ఇంత మట్టుకి అదృష్టవంతులమే. సరళేగనక కిటికీలోంచి కిందకి దూకేసి ఉంటే ఈపాటికొంప గుండంవేసుకు పోయేదిగాని, ఏమన్నా తరవాయి ఉండునా! ఈమూర్ఛ ఎందులోకి దిగు తుందో! ఇదో కొత్తరకం వ్యాధివచ్చి పడింది ఈమధ్య! గొప్ప సంబంధాలకంటూ ఊహూ ఎగడకపోతే తల్లిఘటం ఇక్కడ ఉండకూడదూ ఇల్లాంటప్పుడూ! అబ్బే, ఎందు కుంటుందీ, ఆవిడ అవసరానికి ఉన్నా, అయిన వాళ్లమాట విన్నా, నాకు మరికావలసిందేమిటి ?రోగం రొష్టు చేసుకుంటేనే గాని పిల్లేదాయిరి. రొష్టు చేసుకున్న కొద్దీ అల్పులు యాగీ

చేస్తారు. అల్లాంటియాగీ ఉత్తరోత్తరా వివాహవిషయంలో విషమిస్తుంది. ఏంజెయ్యనూ!

(RM నుంచి మాలోకం వస్తూ)

మా:—అయ్యగారండి. ఇరుగోనండి.

శా:—(RM కిచూస్తూ) రండి. మా అమ్మాయికి సుస్తీగా ఉంది. హాలులో ఉంది.

ధన్ మన్:—(RM నించి వచ్చి) మీరిక్కడే ఉండండి మేం చూసొస్తాం (అని LM కి నడుస్తారు)

శా:— ఒరేయి, అక్కడ చెయ్యికడుక్కోడానికి సబ్బూ నీళ్లూ తుడుచుగోడానికి తువ్వాలూ ఉన్నాయి కాదురా!

మా:— చిత్తం. (ధన్‌మన్‌లు LM కి వెడతారు)

శా:—(మెల్లిగా) ఒరేయ్!

మా:—(మెల్లిగా) అయ్య!

శా:—నువ్వు ఎంతమంది డాక్టర్లని పిలిచి వొచ్చావురా?

మా:—ఒకర్నేనండి. రెండో ఆయన నేపిల్చే సమయంలో మొదటిఆయనతో మాట్లాడుతున్నారట, నేను 'ఏమండోయ్, మాయజమాని మిమ్మల్ని తీసుగురమ్మన్నారండి' అన్నాను. అంటే ఇద్దరూ వచ్చేశారు.

శా:—పోనీలే. ఈయిద్దరూ చాలరంటావా?

మా:—ఒక్కమనిషి పోవడానికి అసలు ఇద్దరుమాత్రం ఎందుకండీ?

శా:—ఏమిట్రా, ఏమిటావేళాకోళం! ఒక ఆలోచన కంటె

రెండు ఆలోచనల జోడింపునయమేమో అని నేను ఈఆదుర్దాలో పోనీ అని ఒప్పుగుంటున్నాను!

మా:--నిజమేనండి. వైద్యసహాయం లేకుండా పోవడానికి ఆలస్యం అవుతుంది

శా:--ఛ. వాళ్లకి వినపడుతుంది. ఊరుకో! వైద్యంవల్ల పోతారంటావేమిటీ, పాడుమాటలూ నువ్వూనూ!

మా:—నిజమేనండి. మరణం అనేది జ్వరంవల్లా, క్షయవల్లా అజీర్తివల్లా ఎల్లా కలుగుతుందో, వైద్యబాహుళ్యంవల్లా, అల్లానే కలుగుతుంది.

శా:—నిష్ఠూరంగా మాట్లాను. వాళ్లు వింటే చంపేస్తారు.

మా:—అదేనండి, నేఅనేమాటాను! మన పిల్లి ఈమధ్య చెట్టు మీంచి పడిందాండీ! అది నోరు మెదపకుండా కాలు కదపకుండా మూడు రోజుల పాటు ఎందుకు బతిగ్గలిగిందీ — పిల్లి వైద్యుల సహాయం లేకపోడంవల్లే! మార్జాలభిషక్కులే గనక ఉంటే, ఒక్క గంటలోపలే ఆ పిల్లిని పిల్లిమంత్రాలు వెయించేసి ఉండేవాళ్లు.

శా:—ష్. చాల్చాలు. మరివాక్కు. వాళ్లిల్లా రాగలరు.

మా:—అవునండి. వచ్చి, మీ అమ్మాయికి పట్టిన జబ్బు ఒక్క ముక్క తెలియకుండా స్పష్టమైన వింత భాషలో చెబుతారు.

(తలుపు తీసిన చప్పుడు) (ధన్ మన్ LM నించి వస్తారు)

శా:—రండి. ఏమిటి సెలవు?

ధన్:— అయ్యా! రోగిని జాగ్రత్తగా పరీక్షించాం. సందేహం లేకుండా ఆవిడ దేహంలో అనేక విషాలున్నాయి.

శా:— ఔరా! అంత విషమించిందాండీ!

మన్:— అనగా, చాలా విషరసాలు ఆవిడలో ప్రకోపించాయి.

శా:— చిత్తం.

మన్:— మే మిద్దరం ఇంకా కొంత కూడబలుక్కుని చెప్పాలండి.

శా:— అల్లానే కానీండి. ఒరేయి, రెండు కుర్చీలు తెచ్చి వెయ్!

మా:— చిత్తం (అని LB నించి రెండు కుర్చీలు తెచ్చి వేస్తాడు)

మన్:— ఎమోయ్, మాలోకం! జ్ఞాపకం ఉందా!

మా.— చిత్తం. తమర్ని మరిచిపోడం తేలికా అండీ!

మన్:— ఆఁ, వీరిబంధువులింటి దగ్గిర కలిశాంకాదూ మొన్నా!

మా:— చిత్తం చిత్తం!

మన్:— వారి బండివాడికెల్లా ఉంది?

మా:— ఇప్పుడేం లేదండి. వాడు ఆ రోజునే టికట్టుచ్చు గున్నాడు.

మన్:— ఎక్కడికి?

మా:— పైకి.

మన్:— ఛ. అది కేవలం అసాధ్యం

మా:— ఏం అసాధ్యమోకాని, ఆవేళ వాణ్ణి పట్టి చేశా రండి మరి!

మన్:— వాడు మరణించడానికి అవకాశంలేదే?

మా:— అయితే మీరే కనుక్కొని తేల్చాలిగాని, నా వల్ల కాదు.

మన్:— వైద్యశారు డన్నదాని ప్రకారం ఆవ్యాధి పద్ధాలుగో రోజునగాని, ఇరవై ఒకటో రోజునగాని, ప్రాణం తీసేస్తుందేగాని ఆలోపున తీసెయ్యదే?

మా:— బహుశా ఆ సంగతి తెలియక వాడు తొందర పడ్డాడు గావునండి.

ధన్:— సరి, ప్రస్తుతాంశం మేం ఆలోచించాలి. మీరు లోపలికి దయచెయ్యండి.

మా:— నేనూనాండి!

శా:— ఆ (అని వాడు నోరుమూసి తీసుగుపోయినట్టు అభినయించాలి LMకి పోతారు) — (తలుపుతీసి మళ్ళీదగ్గిరిగా వేసిన చప్పుడు)

ధన్:— (కుర్చీఎదటికి లాక్కొని) ఇల్లా కూచోండి, డాక్టర్ మన్

మన్:— చిత్రం, డాక్టర్ ధన్

ధన్:— ఏం చెబుదాం!

మన్:— అబ్బా, ఏదోవోటి చెబుదాం లేస్తూరూ! మీరు

రోగులదగ్గిరికి ఎల్లా పోతూంటారు ?

ధన్:-- మీ రెల్లా పోతూంటారు ? నడిచా ?

మన్:-- కాదులెండి. వంటెద్దు బండిమీద. తమరిదేం వాహనం ?

ధన్:-- సైకిలండి. గుర్రాన్నికూడా ఈ మధ్యే కొన్నాను. రోజుకి కొన్ని మైళ్లు తిరగాలి, నేను

మన్:-- పని పూర్తిగా ఉండాలి గాని, విధవ తిరుగుళ్లు తిరగడానికి గుర్రమూ గాడిదా ఎందుకండీ ?

ధన్:-- మీరు అట్టే తిరగక్కర్లేదు గాబోలు ! పాపం !

మన్:-- మీ దయవల్ల చాలమంది నా దగ్గిరికే వచ్చేస్తారు. సరే కానండీ, ఆ అలోపతీ ఉమాపతీ దెబ్బలాటల్లో, మీది ఏపతీం ?

ధన్:-- ఏపతికి ఆదిక్కులుగ్నాయిగాని, నాది హోమియోపతీ పక్షమే ! రోగి పోయినా సరేగాని, అలోపతీలో సబబు కొవ్వది !

మన్:-- నాకూ సబబు గురించి మా చెడ్డపట్టింపు ఉంది. వలహాలు యథావిధిగా ఉంటేనే గాని నేను ఒప్పను.

శా:--(LM నించివచ్చి) అయ్యా, నమస్కారం. పిల్లదానికి జాస్తిగా ఇదిగావుంది. సుస్తీఫలానా అని తమరు త్వరగా తేల్చాలి.

ధన్:--మీరు తేల్చండి, డాక్టర్ మన్

మన్:--నేనా, ఎంతమాటా, మీరే తేల్చండి, డాక్టర్ ధన్.

ధన్:—ఆఁ, తమరు పెద్దలు చెబుదురూ!

మన్:—ఆఁ, తమరు కుశాగ్రబుద్ధులు, ఉపక్రమిస్తురూ!

ధన్:—బాబు కాదు

మన్:—నాయన కాదు!

ధన్:—ఆఁ హాఁ

మన్:—ఊఁ హుఁ

శా:—ఏమండోయ్, మీపట్టింపులకీ మీకూ వేరు వేరుగా దణ్ణం! మీరు తెమల్చాలి. ఇవతల ఆందోళన గమనించండి.

ధన్, మన్:—అయితే వినండి.

శా:—ఓరా! ఒక్కొక్కడే కానీండయ్యా, బాగా నేకుదిరింది మేళం, ఇద్దరూ ఇద్దరే!

ధన్:—అయితేమిుందు నే చెబుతున్నాను, కాస్కోండి. మీ అమ్మాయిను స్త్రీ రక్తోష్ణత! రక్తపరిహారం చేస్తే నేగాని మీపిల్ల జీవించదు.

మన్:— మరి నా మాట వినండి. ఆవిడ తత్వంలో రసాలు వృద్ధి కుళ్లి పోయినాయి. విరేచనభేది ఇవ్వాలి.

ధన్:— భేదిఇస్తే ఏమండోయ్, భేదిస్తే ఆ అమ్మాయి బతకదు.

మన్:— రక్తపరిహారంచేస్తే ఆ అమ్మాయి ఉండదు.

ధన్:— నీ పాండిత్యానికి చాలా సంతోషించాంలే, డాక్టర్ మన్

మన్:— నీ విద్యకి చాలా ఏడిచాంలే, డాక్టర్ ధన్.

ధన్:— అవును. కిందటివారం ఓ మనిషిని టపా కట్టించావ్.

మన్:— అవును నిన్నపొద్దున్న ఓణ్ణి యమునికి సిఫార్సు చేశావ్.

ధన్:— సేనయ్యగారూ! నా నలవారూఢి

మన్:— సేనయ్యగారూ! నా నలహారూఢి

ధన్:— రక్తపీడన తగ్గించకపోతే మీ అమ్మాయి అరగంటలో పోతుంది.

మన్:— రక్తపీడన గనక తగ్గిస్తే మీ అమ్మాయి పావుగంటలోపలే పోతుంది.

శా:— మాలోకం! ఎంత ప్రారబ్ధం వచ్చిందిరా! వీళ్ళిద్దర్లో ఎవర్ని నమ్ముదాంరా ఇప్పుడూ!

మా:— ఇద్దర్నీ నమ్మండి! నేను గట్టివాణ్ణి వెతికి తెస్తానంటే వద్దన్నారుగా! డాక్టర్లూ! తమ అభిప్రాయాలు ఒక్కరవ్వ విరుద్ధంగా ఉన్నాయి.

శా:— అయ్యా! తమరు అనుభవజ్ఞులు! తమరిద్దరూ కలిసి, నిదానంగా ఆలోచించి అద్వితీయమైన కర్తవ్యం ఒక్కటి మాత్రమే సెలవివ్వించాలి.

మన్:— అల్లాయితే, మేం ఇంకా కలిసి ఆలోచించాలి. మీరు లోపలికి వెళ్ళండి.

శా:— చిత్తం. రారా మాలోకం (అని LMకి వెళ్ళిపోతారు)

ధన్:— (స్వరం నొక్కి) ఓరా! డాక్టర్ మన్! నా మాట కొట్టేస్తావా?

మన్:— నువ్వా నా మాట కాదంటావా!

ధన్: - ఊరుకో, నవ్వు ఉత్తమట్టి కలిపి మాత్రలని ఇస్తున్నావ్

మన్:— ఛీ, నువ్వు ఉత్తనీళ్ళు కలిపి మోతాదులని ఇస్తున్నావ్

ధన్:— ఊరుకో, చవటా, నువ్వు రోగం పసికట్టలేవ్!

మన్:— ఊరుకో, దద్దమ్మా, నువ్వు లేనిరోగం ఉందంటావ్!

ధన్:— నోరుముయ్! నువ్వు జనాన్ని చావగొడుతూంటావ్

మన్:— ఛీ, వాగక్కు, నువ్వు జనాన్ని చావగొట్టనేనా లేవ్ (అంటూ వళ్లు గోరుకుతాడు)

ధన్:— ఏయ్, ఆ వళ్లు గోరకడం మానావా, వళ్ళు రాల గొట్టనా!

మన్:— ఈలోపల నీకు నేనే చేస్తాను అంతపనీ!

ధన్:— ఈలోపల నేను వళ్లుతీసి దాచేనుగుంటే నువ్వు పకుస్తూకూచోవాలి.

మన్:— కట్టుపళ్లా! (అని వెకిలిగా నవ్వుతాడు)

ధన్:— ఆ మాట నేనంటే నువ్వెందుకూ అనడం? (అని క్రాపింగు పట్టుగుని వంచుతాడు) అయితే ఇదుగో తిను (అని చెంపవాయిస్తాడు)

మన్:— అబ్బ! (అనివీల్చాలి) క్రాపింగు వదలిపెట్టబ్బాయి, చెబుతున్నాను. నెప్పెడుతోంది. క్రాపింగు ఊడిపోయినా, చెరిగిపోయినా, పరువునష్టందావా వేస్తాను.

ధన్:— వెయ్, అప్పుడిచ్చేస్తాను. తిన్నగా ఉంటావా!

మన్:— ఆ. తీరా అయినొస్తే బాగుండదు, వొదిలెయ్యండి.

ధన్:— సరే, వొదుల్తున్నాను. వాడికి ఒకవేళ మళ్ళీ దెబ్బలాటవస్తే ఈస్థితిలో మొదలెట్టాలి.

మన్:— అబ్బ, మెడ నెప్పెట్టిందండీ! కాని, మనం కొట్లాడుకుంటే ఏం లాభం? వాదన్ని పెంచుకునే వాళ్ళని జనం తేలిగ్గా కడతారు. మన చేతుల్లో జనం పడి తిరేటట్టు దేవుడు రాసి పెట్టాడు. మనుష్యుల లోపాలు కనిపెట్టి గడనర్లు సామ్ముచేసుకుంటారు. కొందరికి స్తోత్రం చెప్పించుకోడం ఇష్టం అందుకని స్తోత్ర పాఠకులు డబ్బుగణిస్తారు. కొందరికి బంగారం చేసే విద్య ఇష్టం. అందుకని సువర్ణయోగం చెబుతాం అనేవాళ్ళు డబ్బు గణిస్తారు. అన్నింటిలోకీ ప్రాణంమీదతీపి మానవుల పెద్ద లోపం. ఆలోపం ధర్మమా అని మనం కుబేరులం కావచ్చు. జయం మనవల్లా, అపజయం ప్రకృతివల్లా వస్తూంటాయని రోగులు నమ్మేటట్టు చెయ్యవచ్చు. రోగికి బాగుపడ్డా మన మీద కోపంఉండదు, చచ్చినా మనమీద కోపం ఉండదు! సోదరా, ఇల్లాంటి వృత్తిలో, మేట్లాడి ధనం చేసుగోక, కొట్లాడుకోడం ధర్మమా?

ధన్:— సోదరా! నీమాట నిజం! కాని, ఒక్కొక్కప్పుడు నాకు మా చెడ్డకోపం! పాపం, మిమ్మల్ని మాగట్టిలెంపకాయ కొట్టాను!

మన్:— ఆఁ దానికేంలెండి మీరుపెద్దలని నేనూరుకున్నాను.

కాని, ఈసందర్భంలో, మనం కలిసినట్టు కనివి స్నేహాలూ, యథార్థంగా కలవనక్కరలేదు!

ధన్:— మిత్రమా! అల్లానే కానీండి.

మన్:— ఈరోగికి నాయిష్టంచొప్పున చెప్పనీండి. ముందుమాటు రోగికి మీాయిష్టం అనుసరిద్దాం.

ధన్:— తథాస్తు! ఇంత సలహాకి కృతజ్ఞుణ్ణి, సోదరా!

మన్:— సరి ఇక ఆయన్ని పిలుస్తాను.

ధన్:— పిలవండి.

మన్:— నేను నిదానించి చెబుతూంటాను, మీారు తడుముకోకుండా దంచెయ్యాలి.

ధన్:— ఓ. మీాచిత్తం.

మన్:— ఏమండోయ్ (అని చప్పట్లు కొట్టి) రండి, చెబుతాం

శా:—(LM నించి వచ్చి, ఇద్దరిమధ్యా నుంచుని ఇద్దరికీ దణ్ణాపెడుతూ) చిత్తం!

మా:— (శాస్త్రుల్తో LMనించి వచ్చి RFకి పోతాడు)

మన్:— (ముందంగా) ఇల్లాంటప్పుడు — నింతరాలోచనా — విశేష నిదానమూ — తో, పని — చెయ్యాలి. ఏమంటే — ప్రథమ ప్రమాదం — కించిత్తే అయినా, పర్యవసానం — విషాదాంతం — కావచ్చు: అని, భిషక్చక్రవర్తి అంటున

ధన్:— (పాటలాగ గంగా) నిజమే. చాలాజాగర్తతో పని చెయ్యాలి. ఇదేమిా వేళాకోళం కాదు. కాలుజారినా మాటజారినా తీసుగోడం కష్టం. మందు జారినా అంతే. ఒలికిన

పాలు మరి ఎత్తలేం కాబట్టి, ముందుగానే తర్జన భర్జన పడాలి, రోగుల శరీర తత్వాలు పోల్చుకోవాలి, వ్యాధుల మూలాలు పసికట్టాలి, తగ్గ ఔషధాలు నిర్ణయించాలి.

శా:—ఔరపుణ్యం! ఒకాయన తాంబేలు పడక, రెండో ఆయన లేడిపరుగు!

మన్:— అయ్యా! మీకుమూర్తి వ్యాధికిమూలం ఏమిటి అంటే—, లక్షణాలన్నీ చూడగా— అన్నకోశాశ్రితమై— దుష్టమై— నిబిడమై— నిరంతరమైన— రసమిశ్రణంలోంచి— బయల్దేరి— సూటిగా వెళ్లి—మస్తిష్క-పార్శ్వాల్ని—మంటలెత్తించే— ఒకవిధమైన— ఆవిరియే

ధన్:—అవును. పైగా అన్నకోశంలో ఆ వివిధరసాలు ఉత్పన్నంకావడమూ, అక్కడే అవి చిరకాలవాసం చెయ్యడమూ, గత్యంతరం లేక అవి ఘనీభవించి గడ్డకట్టడమూ, ఆస్థితిపరివర్తనం జరిగే ముహూర్తంలోనే విషగంధాలు ఏర్పడడమూ, వాటిస్వభావ ప్రకారం అవి తిన్నగా తలకెక్కడమూ, జరిగిందే.

మన్:—కాబట్టి, ఆవిష రసాల్ని—అక్కణ్ణించి—పారద్రోలడానికి—మంచి— విరేచన భేది— అవసరం—

ధన్:—ఆ తరవాత మేం అవసరాన్నిబట్టి సమయానుకూలంగా సందర్భానుసారంగా యథాశక్తిగా యథావిధిగా యథాతథంగా రక్తోత్సర్జన మొదలైన చికిత్సలు జరుపుతాం

మన్:—తె—లి—సిం—దా! మీకు— తె—లి—సిం—దా!

ధన్:— తెలియలా? మీకు తెలియలా? తెలీలా!

శా:—అయ్యా! మందండాక్టరుగారూ! మీకు— అనేక— వినయపూర్వక— వందనాలు! అయ్యా, చురుకుపాలుగారూ! మీరీ విషయంలో విశేషంగా తంటాలుపడ్డారు గనక మీకు నేను సతతమూ సర్వకాల సర్వావస్థల్లోనూ సరిగ్గా కృతజ్ఞుణ్ణి. ఇద్దరూ దయచేయ్యండి. క్రమేపీ దర్శనం చేసుకుంటాను.

ధన్:—మీ దర్శనం అవసరంలేదు. మా దర్శనాలకీ సలహాలకీ బిల్లులు, వేర్వేరుగా, పంపుతాం! మన్నించండి!

శా:—చిత్తం చిత్తం.

(ధన్, మన్‌లు RF కి వెళ్లిపోతారు.)

అమ్మయ్య! (ఆనందంతో) ఒరేయ్ మగో కం!

మా:—అయ్యో అయ్యో! ఏమన్నారండీ! (అంటూ RF నించి వస్తాడు)

శా:— ఏమన్నారా! ఇంగితజ్ఞానం లేనివాళ్లని పిలిచేవాళ్లకి ఇంగితజ్ఞానం ఎల్లాఉంటుంది అన్నారు! ఇద్దరూ చెరో పీసెడు అజ్ఞానమూ నాకు దానం చేసి, నాబుర్రలో కూరేశారు.

మా:— మీరేకాదండీ ఈ వర్కువాళ్ని పిలవమంటూ!

శా:— అపరాధం! కొత్త వైద్యుడన్నావేం, పోనీ వాణ్ణి తీసుకురా సైకిలుమీద వెళ్లి! ఊఁ (అంటూ, చిటికెలు వేస్తాడు)

మా:— చిత్తం (LF కి వెళ్లి సైకిలు తెచ్చి RF కి సైకిలు తీసికెడతాడు.)

శా:— అబ్బబ్బ! ఎల్లావచ్చింది చిక్కూ! రోగి దగ్గిర నేను ఒక్కణ్ణే కూచోడం నాకు భయం! అందులోనూ రోగి మూలుగుతూంటే మరీ భయం! పైగా కారణం ఏమిటో తెలియక పోతే చెప్పనే అక్కర్లేదూ! ఆదీకాక, స్వజనం బాధమూన్తూ అసలు భరించలేను! అన్నీ ఆట్లాఉంచి మా పరశింత ఉత్సాహవంతురాలు హీనపడి పోతూంటే చూస్తూ కూచోడం నాతరమా! పిల్ల ఎంత నీరసించిపోయిందీ! ఆ తాంబేలు డాక్టరూ అంతే, ఆ లేడి డాక్టరూ అంతే! వాళ్ల సొమ్మేం పోయిందీ! విరేచనభేది ఇవ్వాలట! పిల్ల మరీనీరసించిపోయి పిల్లకి ఆకాస్త మాటాకూడా నిజంగాపోతే ఎంజెయ్యనవ్వడూ! రోగం రాగానే బాధ, వైద్యం చెయించకపోతే బాధ, వైద్యం చెయిస్తే మరోబాధ, చేస్తూన్న వైద్యం మనికి నచ్చకపోతే బాధ,చేస్తూన్న వైద్యాన్ని మానిపించడం ఇంకాబాధ, అప్పుడు మరోణ్ణి కుదుర్చుకోడం చాలాబాధ! ఈవచ్చే కొత్తవాడు ఏమి సాగ్లాచేస్తాడో! పోనీ, పిల్లకి నిబ్బరంగా ఇంత నిద్దరట్టినా బతుకుదుం! ఎందుకేనా మంచిది, ఒకపనిచేస్తాను. అంతయ్య ఇల్లు ఆట్టే దూరంకాదు. అతడికి బ్రాందీ వ్యసనం ఉంది. అతణ్ణడిగి కాస్త బ్రాందీ పట్టుకొస్తాను. అది ఒక్కి రవ్వ ఇస్తే కొంచెం వేడిఅందుకుని నిలబాటు చేస్తుంది. తిరవాత చూసుకోవచ్చు.

(RF : పోతాడు — తెర)

## 3వ రంగం

### రెండవ తెర ఎదట

(RFనించి ముందు మాలోకం వస్తాడు)

మా:— (మెల్లిగా) రండి, రండి సువర్ణంగారు!

సు:— (RFనించివచ్చి) (మెల్లిగా) టట్! నన్ను సువర్ణంగారు అనకు డాక్టర్ అను.

మా:— చిత్తం. అల్లాకేనండి.

సు:— (మెల్లిగా) యజమానిగారు! ఏంజేస్తున్నారో చూడు!

మా:— పిలుస్తానుండండి. (LF కేసి జరిగి) అయ్యగారూ! అయ్యగారూ! ...లేరండి. ఎక్కడికేనా వెళ్లారేమో! మనం గట్టిగానే మాట్లాడుకోవచ్చు.

సు:— సరే, నే నెల్లా ఉన్నానూ!

మా:— పెళ్లికొడుకలా ఉన్నారు!

సు:— అదికాదోయ్, డాక్టర్లా ఉన్నానా!

మా:— మీరు మనోవైద్యులుగా! పైకి ఎల్లా తెలుస్తారూ!

సు:— యజమాని నన్ను పోల్చుకోడు గద!

మా:— పోల్చడం ఆయన వశంకాదండీ! ఆయనకు మొదటు దళ నరి. ఒకవేళ ఆయన పసికట్టినట్టు కనిపిస్తే, నూర్లో ఎత్తువేస్తాం.

సు:— అంతా నీలో ఉంది.

మా:— నే నెల్లాంటి వాణ్ణి!

సు:-- వెన్నలాంటి వాడవ్.

మా:-- అల్లాంటి వాణ్ణి గదాండీ, ప్రేమవంతుల బాధలు చూస్తూ ఊరుకోగల్నాండీ !

సు:- ఊరుకోలేవు.

మా:- కొందర్ని మొదటి సారి చూడగానే అనహ్యాం వేస్తుంది. మిమ్మల్ని చూడగానే కొత్త వాళ్లకి స్నేహం పుడుతుంది. సరళమ్మగారికి తగ్గ వారు మీరేనండి.

సు.-- నీ దయ. ఈ వర్ణాగం నెగ్గాలిక దా !

మా:-- నిమిషం అండి. ఉండండి. మాయజమాని గారు వస్తున్నారు. (RB కేసిచూపించి) మీరు ఈయింటిపక్కఉండండి. మీకోసంమళ్లీ వస్తాను. ప్రస్తుతం నావెనకాలే దాక్కుంటూ ఆయన రావడంతోనిష్క్రమించండి.

సు:-- సరే సరే. (అని అట్లాచేస్తాడు)

మా:- రండి, రండి, రండి అయ్యగారూ, రండి.

శా:-- (RF నించి బుర్రవంచుగుని చేతులు వెనకాల కట్టి నట్టు పట్టుగుని) ఏమిటేమిటీ !

మా:- సంతోషమండి అయ్యగారూ, సంతోషం !

శా:-- సరే సరే, ఏమిటి సంగతి ?

మా:-- ఆనందించండి.

శా:- సరే, ఎందుకసి ?

మా:-- ముందు ఆనందించండి, తరవాత చెబుతాను.

శా:--అబ్బ ముందుచెప్పు,తరవాతపోనీ అల్లానేఆనందిస్తాను.

అబ్బ! అనలెందుకేమిటీ!

మా:— నే చెబుతున్నాను కాదండీ అయ్యగారూ!

శా:— సరే పోనీ, హిహిహి...సంగతేమిటీ!

మా:— మెత్తగా నవ్వండి!

శా:— ఇదుగో! (అనిమెత్తగా నవ్వి) ఏముటో చెబుదూ!

మా:— కొద్దిగా పాడండి ఆయ్‌రనీ

శా:— అబ్బనరేరా, ఆయ్‌రనీ...ఏమిటివిషయం? అమ్మాయికి వంట్లో...

మా:— నిమ్మళించిందండి.

శా:— (నంతోషంతో) ఏమిటీ? నరళకి నిమ్మళించిందా! అప్పుడే! ఇంతట్లో నే.

మా:— అడ్డమాండి! నేను ఆకొత్తడాక్టర్ని నిమిషంలో పట్టుగుని తెచ్చాను.

శా:— ఇంతట్లో వైద్యం పూర్తి అయిపోయిందా!

మా:— లేదండి. మీరురాండే!

శా:— మరి నిమ్మళించింది అంటావేం? వేడిచేవాణ్ణి నవ్వమనీ!

మా:— అంటే, అంతహూఢిగా నిమ్మళించి తీరుతుందండి.

శా:— ఎక్కడున్నాడు? కొత్తవైద్యుడూ!

మా:— మీరొచ్చేదాకా ఈపక్కని ఉండమన్నాను.

శా:— నరే. తీసుగురా, కడంవాళ్లకంటె నయమేమో చూద్దాం.

మా:— ఉండండి మరి. (చప్పట్లు కొడుతూ RFకి వెళ్లి) ఏమండోయ్, రండి. ఇదుగోనండి. (సువర్ణం RF నించివస్తాడు)

శా:— ఈయనా! ఈయనకి మామూలు డాక్టర్ల పటా టోపం లేదేం!

మా:— పటాటోపాన్ని బట్టా అండీ పాండిత్యం నిర్ణయిం చడం! సామర్థ్యం అవసరం కదా అండీ.

శా:— నిజమేరా, మా లోకం పోనీ అల్లానే ఏమండీ, మహాశయా, మీదగ్గిర పేగుల్ని శ్రావణ చేసే కుప్పెలు అద్భుతమైనవి ఉన్నాయట, నిజమేనా?

సు:— అయ్యా, మా మందులు మామూలు రకం కాదు. అల్పవైద్యులైనవాళ్ళు బేదులూ, మూలికలూ, ఓషధులూ, పాడిచే రసాలూ వాడతారు. కాని మేం ధ్వనులూ, మాటలూ అక్షర పత్రాలూ, (తాయెత్తులూ, రక్షరేకులూ) యుక్తిలో ఉంగరాలూ వాడతాం

మా:— నే చెప్పలేదటండీ, అయ్యగారూ! ఈయనమాదిరే అద్భుతమండీ!

శా:— అవున్రా. మొదలెట్టగానే తెలుస్తోంది ఈయన అఖండుడని.

సు:— మీరేనా యజమాని?

శా:— చిత్తం, డాక్టరుగారు, నేనే యజమానిని

సు:— మీకుడిచెయ్యి ఇల్లా తెండి, నాడి చూస్తాను.

శా:— ఇదుగో

సు:— ఇంకేం! మీ అమ్మాయికి సుస్తీగా ఉంది.

శా:— ఓర్రి, అసాధ్యుడా! మాఅమ్మాయి సుస్తీ నానాడి బట్టే నీకు తెలుస్తోందా!

సు:— ఓ శేషుగ్గా! పిత్రా ప్రాతికల నాడులు వివాద స్వరాలలో కొట్టుకుంటూ ఉండవచ్చునని మావైద్యంలో సిద్ధాంతం

మా:— సరళమ్మగారిని పిలవనాం కీ, అయ్యగారు!

శా:— రమ్మను, నెమ్మదిగా రమ్మను.

(రెండవ తెర లేవగా ఇంట్లో ఒక గది— LM నించి సరళ, మాలోకం వెనకాల వస్తుంది)

మా:— రండి, సరళమ్మగారు. ఈకుర్చీమీద కూర్చోండి. ఇకరండి అయ్యగారు! మనం ఇల్లా పక్కకి తప్పుకుని నుంచుందాం.

శా:— నే నిక్కడే ఉంటాను.

మా:— అబ్బే, మనం ఉండ కూడదండి. రోగిని అనేక ప్రశ్నలు వేస్తారు డాక్టరుగారు. తక్కినవాళ్ళు ఆప్రశ్నలు వినడం అధర్మం.

శా:— సరేలేస్తూ! ఇక్కడ నుంచుంటాను. నువ్వెళ్ళు. (అని LF దగ్గిర నుంచుంటాడు)

మా:— చిత్తం

సు:— ఈవిడ పేరేమిటి, సరళ కాదూ అన్నారూ! ఓసరళగారూ! మిమ్మల్ని చూడడం నాకు చాలా సంతోషం. ఏ మాటల్తో సంభాషణ మొదలెట్టాలో తెలియడంలేదు. ఇప్పటి

దాకా మిమ్మల్ని చూడడం మాత్రం చూశాను. ఇప్పుడు నాకు నాలిక మించి మాటకూడా స్వేచ్ఛగా బయులుదేర పోతూన్నా సంతోషం మితిమీరడంవల్ల నాలిక ఆడటంలేదు.

స:— నేనూ అంతే. మీకు మల్లేనే, అతి సంతోషంలో నోరు విప్పలేకుండా ఉన్నాను.

సు:— నా మనస్సులో నాకు అనిపించినట్టే ..

స:— నా మనస్సులో నాకూ అనిపిస్తోంది.

సు:— నా హృదయంలో ఉన్న సంగతి...

స:— సంగతే నా హృదయంలోనూ ఉంది.

సు:— అలా నన్ను మీరు అనుకొనిస్తే, ధన్యుణ్ణి.

స:— అలామీరు అనుకోగలిగితే ధన్యురాల్ని

సు:— నన్ను రప్పించడానికి ఈపన్నాగం మీరు వేసిందేనా?

స:— పన్నాగం నేను వెయ్యలేదు. అదుగో, మా నాన్నగారు!

శా:— (మెల్లిగా) ఒరేయ్, మాలోకం

మా:— (మెల్లిగా) అయ్య!

శా:— (మెల్లిగా) వాడు సరళ మొహంమీద మొహంపెట్టి మరీ అల్లామాట్లాడుతున్నాడేం?

మా:— ఆఁ ఏముందీ! ముఖరేఖలు నిర్ధరించి, ముఖలక్షణాల వయినం కనిపెడుతున్నారు.

సు:— సరళా! నువ్వు నాయందు కనపరిచేటటువంటి ఈ ప్రేమ ధ్రువమేనా?

శా:— (మెల్లిగా) ఒరేయ్, ప్రేమ అంటాడేమిట్రా!

మా:-- అభ్యాపమిటండీ ప్రతీదానికీనూ! అది కొత్తవ్యాధి గావును!

స:-- నాప్రేమ ధ్రువం మీ నిశ్చితాలు మీరు పాటిస్తారా?

సు:-- కలకాలమూ పాటిస్తాను. నీకు చెందడమే నావర మావధి. అవునో కాదో నీకే తెలుస్తుంది, చూద్దుగాని!

స:-- అయితే, సరేనండి (అని మెత్తగానవ్వుతుంది) మరి బలిగానన్న మాటే!

శా:-- ఒరేయి, మనరోగిష్టి పిల్ల కొంచెం ఉత్సాహంలో పడింది రా, రా.

మా:-- ఏరీ? నేచూస్తానుండండి. అవునండోయి, ఎంత ఆశ్చర్యమండీ? ఎంత కులాసాగా ఉన్నారో ఇవ్వాడు!

సు:-- అయ్యా, వినండి కులాసా ఎందుకు కలిగిందంటే, నా విద్యనిబట్టి నేను చిన్న మందొకటి వాడి చూశాను. శరీరం మీద అధికారి, మనస్సు! శరీర వ్యాధులకి మూలం, మనస్సే. అందుకని నేను ముందు మనస్సు కుదురుస్తూంటాను. మొదట ఈమె చూపులూ, ముఖవైఖరీ చూశాను. క్రమంగా చేతుల్లో రేఖలు చూశాను. కొంచెం దైవజ్ఞుణ్ణి కాబట్టి ఇక్కడ జబ్బు మనస్సు జబ్బే. అని పోల్చుగున్నాను. లేనిపోని ఊహావిహారమూ పెళ్లాడాలని బలీయమైన కోరికా—ఈ రెండింటివల్లనే ఆ మనస్సు జబ్బు అందులోనూ, జనానికి పెళ్లిమీద ఉండేమక్కువ చూస్తే నాకు కొంచెం అతిగా ఉన్నట్టునూ, ఈ రోజుల్లో హెచ్చుతగ్గుగా ఉన్నట్టునూ కనిపిస్తుందండీ!

శా:—(మాలోకాన్ని మెచ్చి) మాలోకం! ఓరి, నీ తెలివి బంగారంగానూ, ఎంత తెలివిగలవాణ్ణి తీసుకొచ్చావురా!

మా:—(నవ్వుతూ) ఏమిటనుకున్నారు, మరి!

సు:—కాని, వివాహం అనే విషయానికి నేను పెడముఖం పెడతాను.

శా:—ఔర! ఏమి ప్రజ్ఞండీ! మాలోకం! నామనస్సులో ఉన్నవన్నీ ఈయన వరసాగ్గా చెప్పేస్తున్నాడురా!

మా:—లేనివి కూడా చెబుతూంటాడు, జాగ్రత్తగా వినండి

సు:—రోగులు ఏమంటే మనమూ అదే అనాలి. ఈవిడలో లోపంఒకటి కనిపించింది. ఆలోపం గురించిన జాగ్రత్తపడకపోతే ప్రమాదించేలా కనిపించింది. ఆలోపాన్ని ఆధారం చేసుగునే నేను ఆవిడతో మాట్లాడాను "ప్రస్తుతం నేను రావడం తనని నాకిచ్చి పెళ్ళి చెయ్యమని మిమ్మల్ని, అడగడానికే!" అని తప్పావేసి చూశాను. ఆ తప్పాతో సుబ్బు విడ్డట్టు, మెరుపు మెరిసినట్టు, ఆవిడవైఖరి మారింది. ముఖానికి కలకలవచ్చింది, నేత్రాలకి జీవం చేరుకుంది. ఈవిశ్వాసంలో ఈవిణ్ణి కొంతకాలం ఉంచి ఊరుకుంటే, ఈవిడ వ్యాధి పూర్తిగా మళ్ళుతుంది.

శా:—ఆహాహా! డాక్టరుగారూ! చాలాబాగుంది. ఈ చర్య యావత్తూ నాకు సమ్మతమే.

సు:—తరవాత, సంపూర్ణారోగ్యం కలగడానికి ఇతర ఔషధాలు వాడవచ్చును.

శా:—(కొంచెంనవ్వి) ఔనౌను. అదే ఉత్తమమార్గం.

సు:— మీరుకూడా అల్లాచెప్పిచూడండి. సుస్తీ అసలు తగ్గి పోతుంది.

శా:— అమ్మాయి, సరళా! ఈయన నిన్ను పెళ్ళాడడానికే వచ్చారమ్మా! నిజమేనమ్మా! నేను ఇందుకు సంతోషంతో ఒప్పుగుంటున్నానని ఈయనతో చెప్పాను. నీతోకూడా చెబుతున్నాను. సుస్తీ తగ్గించుకో అమ్మా! అసలు నీకు సుస్తీ ఉండదమ్మా!

స:— అయ్యో! బుద్ధిపూర్వకంగా నువ్వెక్కడ ఒప్పుగుంటావ్, నాన్నా!

సు:— (రహస్యంగా శాసయ్యతో) ఒప్పుగుంటాననండి,ఊరికే.

శా:— ఆఁ నేను మహ రాజులాగ ఒప్పుగుంటానమ్మా!

స:— మీరు చెప్పేది మనః పూర్వకమేనా?

శా:— మనః పూర్వకమూ హృదయపూర్వకమూ కూడా నమ్మా, వెర్రితల్లీ!

స:— ఏమండీ, డాక్టరుగారూ! మీరునాభర్త కాగోరుతున్నారా!

సు:— అవును.

స:— అందుకు మానాన్న అంగీకరిస్తున్నాడా!

శా:— అంగీకరిస్తున్నాడే, చిట్టి తల్లీ! అంగీకరిస్తున్నాడూ!

స:— ఇదంతా నిజమే అయితే, నా సంతోషం అడిగారూ!

సు:— సందేహించకు, సరళా! నీమీదనా ప్రేమా, నీభర్తను కాగలిగితే చాలనేటటువంటి వాంఛా, నేటి కావు. ఇక్కడికి

నే వచ్చింది అందుకే!

(రహస్యంగా శానయ్య చెవులో) ఊరికే అంటున్నానండీ, శానయ్యగారు!

శా:— అవునవును. నాకు తెలుసును. బాగుంది. అల్లానే అనండి

సు:— అసలు పరమయథార్థం చెప్పెయ్యాలంటే, సరళా, నా ప్రస్తుతస్థితిగాని, వేషంగాని, నిజంకావు. మీనాన్నగారిఎట్ట ఎదటే నిన్నుకలుసుగుని, నాకోరిక ప్రకటించడానికి వీలుండే నిమిత్తమే, నేనువకో డాక్టర్‌నంటూ మిషకల్పించుగుని వచ్చాను.

స:— మీరు నామీద అతి గంభీరమైన ప్రేమ ప్రకటిస్తున్నారు. అది నాకు ఎంత బోధపడాలో అంతా బోధపడింది.

శా:— ఆఁ ఆఁ ఆఁ, ఆసి ఇంద్రజాలీ! చిత్రమవుతుంది. ఎంత బోధపడాలో అంతా బోధపడిందిట! నే చెప్పినప్పుడే బోధపడి ఉండకూడదూ, ఈ మారాముళ్లు లేకుండానూ!

స:— నాన్నా! నన్ను ఈయనకివ్వడం, నీకు నిజంగా ఇష్టమేనా, కాదా?

శా:— నిజంగా ఇష్టమేనే మహాప్రభో అని ఎన్నిసార్లు చెప్పిస్తావేమిటి నాచేతా! పోనీ నువ్వు నమ్మకపోతే, పదీ నీచెయ్యి! డాక్టరు బాబూ, నీ చెయ్యి ఇల్లాతే అమ్మా, దీనికింకా నమ్మకం లేదుటా! నీచేతులో ఉంచుతాను. సరా? ఇప్పుడు నమ్మకం కుదిరిందా అమ్మాయి!

సు:— తన నమ్మకానికీ నా కృతజ్ఞతకీ తార్కాణగా ఈ

ఉంగరం ఆవిడ వేలుకి ధరించాలి. ఇది మనోవ్యాధుల్నీ భ్రాంతుల్నీ పారదోలే యక్షిణీ ఉంగరం.

స:— సరే, అల్లానే ధరిస్తాను. అల్లాయితే పెళ్లి—ఖరారు వ్రాయండి.

సు:— (మెల్లిగా) శానయ్యగారూ! ఈ సంగతి వ్రాత మూలం చేస్తేమాత్రం చిక్కేమిటి!

శా:— (మెల్లిగా) చిక్కా! చిక్కు ఎంతమాత్రం ఉండదు. (అని దగ్గి—ప్రకాశంగా) అయితే, డాక్టరుగారూ, చూడండి! అమ్మాయి కోరుతూన్న దల్లా, తమ దయవల్ల, శాస్త్రంత వివాహపు టగ్రిమెంటుకదా! ఆ కాస్తముక్కా మీరు రాసి ఇచ్చెయ్య కూడదూ పోనీనూ!

సు:— అందుకభ్యంతర మేమిటండీ! తమ ఆసరా ఉండాలిగాని!

శా:— నేయిక్కడున్నాగా, రాసిస్తురూ!

సు:— ఉంటే సరికాదండి, అంగీకారం ఇవ్వాలి.

శా:— ఓ దివ్యంగా ఇస్తాను.

సు:— అయితే ఇదుగో! (అని రాయడం అభినయించి) "సరళని వివాహం చేసుగుంటానని ఈ తేదీని నేను బుద్ధిపూర్వకంగా నా సమ్మతిని మ టయిస్తున్నాను. సరళ ఇష్టమే తన యిష్టమని సరళ తండ్రిగారు అనగా శానయ్యగారు తమ అంగీకారం ఇచ్చారు."

శా:— పొట్టొట్టి అంగీకారమే కాదు. పదివేల రూపాయలు

కూడా ఇస్తానని రాయండి.

సు:— ఓ. రాస్తున్నాను. (అని అభినయించి) " ఈ వివాహా నికి ఒక షరతుగా సదరు శాస్త్య్రగారు, వరలకి...

శా:— 'వరలకి' కాదు — 'దంపతులకి' అని రాయండి.

సు:— (రాయడం అభినయించి) రాశానండి. " దంపతులకి పదివేల రూపాయలు ఇవ్వవలెను: — ఇట్లు, సువర్ణం."

స:— డాక్టరుగారూ! మీరు చాలాకృతజ్ఞురాల్ని. నాన్నా, ఇకనువ్వు— — — (అని సందేహిస్తుంది)

సు:— దీనిమీద మీసంతకం కూడా చేశారంటే,ఇప్పటి మాట సరేసరి ఇక ముందుకూడా మీ అమ్మాయికి సుస్తీఅనేది ఉండనే ఉండదండి.

శా:— చూశావా అమ్మాయి! అగ్రిమెంటు ఎల్లాతయారు చేయించామో చిటికెలమీదా! ఈకాగితం నీదగ్గర పెట్టుకో! జాగ్రత్తగా పెట్టుకో అమ్మా! తరవాత తర వాత నేనుకూడానూ, దీని మీదా, నాసంతకం కూడానూ, చేసేస్తానూ! సుబ్బరంగా ఉంటుంది.

స:— కాదునాన్నా! నువ్వూ ఇప్పుడే చెయ్యాలి సంతకం! తరవాత ఎందుకూ! నీసంతకం లేకుండా ఆకాగితం నాదగ్గి రెందుకూ! నేనూ నాసుస్తీ ఉంటాం, తీరిపోతుంది.

సు:— నిజమేనండి. సుస్తీ తిరగ బెట్టచ్చు.

శా:— ఇంతేనా మహాద్భాగ్యం! ఎదండీకాగితం. ఇదుగో (అని రాసి) నా సంతకం. సరా? తృప్తేనా? సంతోషమేనా?

స:—చాలా సంతోషం నాన్నా! తల్లిదండ్రులఋణం ఏవంతాగమైనా తీర్చ గలిగినా, నీఋణంమాత్రం నేనతీర్చలేను, నాన్నా!

శా:— ఋణానికేం మమ్మా, తల్లీ! మనస్సు కుదిరింది కదా!

స:— ఓ. మనస్సుకుదరడమే కాదు, జీవితం కుదిరింది.

శా:— అమ్మయ్య! అదే నేకోరేది.

సు:— మరోపనిచేశానండి. నేను ఒక వాద్యమేళం వాళ్లని కూడా తీసుకొచ్చాను. వాళ్లవాయింపు సమ్మేళనయొక్క ప్రాశస్త్యతికి మనోవ్యాధులు సర్దుకుంటూంటాయి! వాళ్లని వాయించ మనవమ్మా! మాలోకం!

మా:— వాళ్ళెందుకండి! నేను ఆమాత్రం మేళం చెయ్యలేనా!

సు:—ఇక కొంచెం గాలిషికారు చెయ్యడం కర్తవ్యం! ఇంటి చుట్టూ తోటలో తిరిగి రావచ్చును, రా, సరళా! (అని RF కి వెడతారు)

శా:— ఓరేయ్! వ్యాధి ఇంత తమాషాగా కుదర్చడం ఎక్కడా చూడలేదు. మనోవైద్యం ఇదే గావును!

(కార్ హారన్ వినపడుతుంది)

అదేమిట్రా! వీళ్ళు కారు మీద వెడుతున్నారా ఏమిటి?

మా:— బహుశ పెళ్ళినమోదు చెయించడానికి అధికారి దగ్గిరికి వెడుతున్నారుగావును.

శా:— పెళ్లినమోదు ఏమిట్రా, నీమొహం!

మా:—నిజమేనండీ, ఆ డాక్టరు ఋమ్మల్ని మించాడు.

శా:— ఇతడు అమ్మాయిని లోగడే ఎరుగునా?

మా:— చదువుకున్నప్పుడే ఎరుగునేమో!

శా:— ఇందాకణ్ణించీ జరిగింది వొట్టి తమాషాకోసం కాదూ

మా:— తమాషాకోసం కాదు, మజాకోసం.

శా:— హారి! ఈ వ్యవహారంలో నువ్వూ ఉన్నావే ఏమిటి?

మా:— మీరూ ఉన్నారుగా!

శా:— అయితే ఇదంతా నాటకమే!

మా:— కాదండి, పూర్వరంగం!



## శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి

### గ్రంథాలు

| | |
|---|---|
| ఇప్పుడు | అచ్చు అవుతున్నవి: |
| గుసగుసపెళ్ళి | నిజం |
| పెళ్ళి ట్రెయినింగు | మన తెలుగు |
| అచ్చు అవుతున్నవి: | మాటవరస |
| అప్పుడు | లోకోభిన్నరుచిః |
| రెండు రెళ్లు | తనలో |
| కాలక్షేపం (1) | కాలమహిమ |
| కాలక్షేపం (2) | చంద్రుడికి |
| అన్నీ తగాదాలే | మృచ్ఛకటిక |
| అవును | ముద్రారాక్షసం |
| మేజువాణి | ప్రణయరంగం |

వెల: ప్రతి కాపీ పన్నెండణాలు

త్వరలోనే వెలువడగలవు



ప్రతులకు: అద్దేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

## శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారి

### గ్రంథాలు

ఇప్పుడు

గుసగుసపెళ్ళి

పెళ్ళిట్రయినింగు

అచ్చు అవుతున్నవి:

అప్పుడు

రెండురెళ్ళు

కాలక్షేపం (1)

కాలక్షేపం (2)

అన్నీ తగాదాలే

అవును

మేజువాణీ

అచ్చు అవుతున్నవి:

నిజం

మన తెలుగు

మాటవరస

లోకోభిన్నరుచిః

తనలో

కాలమహిమ

చంద్రుడికి

మృచ్ఛకటిక

ముద్రారాక్షసం

ప్రణయారంగం

వెల: ఒక్కొక్కటి పన్నెండణాలు

త్వరలోనే వెలువడగలవు



పబ్లిషర్సు: అడ్డేపల్లి అండ్ కో

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము